మునిమాణిక్యం నరసింహారావు



# కాంతం కథలు

# కవి ఆనందము

1

హోరుమనెడి ఘోరమైన తుపానులో మున్నీటనావలు మునిగిననేనేమి? సముద్రము పొంగి పొరలిననేమి? నాకది భయానకము కాదు, ఆ గంభీర సంద్రమున, ఆ అనిలోద్ధూత వీచికాతుంపరలపై నెక్కి నృత్యము చేసెదను,

2

కృష్ణానది పొంగి పొరలిరానీ! గిరగిర తిరుగుచు నురుగులు కక్కుచూ కాళ మృత్యువులాగు కనిపింపనీ, ఆఝురీ వేగము నన్నాకర్షించును. కృష్ణవేణి తరంగమాలికలపై నుయ్యాల లూగుదును. కృష్ణాతరంగములతో గొంతెత్తి పాడుదును. మధురగాన మొనరింతును.

3

పట్టణములు భగ భగ మండిపోనీ! ఆ కరాళజ్వాలా మాలికాచయము, ఆ దవాగ్ని కీలలు, ఆ దవానలోద్భూత ధూమశకలములు నన్నాదింపజేయును. నేనాడుదును. వీణాగాన మొనరింతును.

4

భూకంపమున కులాచములు ఘూర్ణిల్లనీ, అగ్నిపర్వతములు పగిలి పోనీ! ఆభీకర సమయమున నేనొంటిగా ప్రపంచము వెలుపల గూరుచుండి ప్రకృతికన్యతో ఆడుకొందును.

5

నేను కలలలో అల్లుదును. ఆ కలలలో అల్లిన అల్లికలు తెగనివి. అవే నా సర్వస్వమును. నా కలల కంతములేదు. నాయూహా ప్రపంచములోనివి క్రీడారంగములు.

# కోటు

నల్లపాటి గంగాధరంగారికి ఒకటే కోటు ఉన్నదనే విషయం అందరికీ తెలుసు. ఆయన హేవిళంబి నామ సంవత్సరంలో ఆ కోటు కుట్టించినట్లు నిదర్శనాలు ఉన్నవి. మరి కొందరు "కాదు అంతకు పూర్వం విజయనామ సంవత్సరంలో కుట్టించినట్లూ సూరిపెల్లి ముత్తయ్యసెట్టి కొట్లో కొన్నట్లూ, ప్రబల నిదర్శనాలు చూపి కోటు యొక్క జన్మ కాలం వెనుకకు జరుపుతున్నారు. అదీకాక అన్నిటికంటె ప్రబల సాక్ష్యం ఆయన ధర్మపత్ని. ఆమె మా పెద్దబ్బాయి పుటకలకు ఆ కోటు చూచిన జ్ఞాపకం అని చెపుతున్నది. పెద్ద అబ్బాయికి ఇరువై ఆరు సంవత్సరములు కాబట్టి ఆకోటు ఇరవై ఆరు సంవత్సరముల పూర్వపుది అని మాత్రం ఒప్పుకోవాలి. ముత్తయ్యసెట్టి లెక్కలను బట్టిచూస్తే ముప్ఫయి సంవత్సరములు అని తేలుతుంది. ఈ రెండింటికి సమన్వయం ఎల్లాగని ఒక ఆయన్ని అడిగితే ఆయన ఒక విధంగా సమన్వయం కల్పించాడు. అది ఏమిటంటే ఆ కోటు ఆయన పెద్ద అబ్బాయి పుటకలకు పూర్వం కుట్టించి ఉంటాడు. కాని అప్పుడప్పుడు వేసుకోవటంవల్ల ఆమెకు ఆ విషయమై జ్ఞాపకం లేదు.

P. సుందరరావు గారి డయిరీ మరొక సాక్ష్యాన్ని ఇస్తున్నది. మన కోటు విషయమై మాట్లాడే కాలానికి ముప్ఫయి సంవత్సరములకు పూర్వం ఆయన సజీవుడై వుండేవాడు. ఆయన ఒకరోజు బహిరంగసభలో గంగాధరం గారిని కలిసికొన్నట్లూ ఆయన అప్పటికి కొద్దిరోజుల క్రిందనే

కుట్టించిన పూలుకోటు విషయమై ప్రసంగించినట్లు తన జీవిత చరిత్రలో వ్రాసుకొన్నాడు. కాబట్టి దీన్నిబట్టి చూస్తేఆకోటు మున్నయి సంవత్సరములకు లోపున కుట్టించిన కోటు కాదని తేలుతున్నది. ఇంటర్నల్ ఎవిడెన్స్‌నుబట్టి చూస్తే కోటు తప్పక పురాతనమైనదని తేలుతున్నది. ఆ కోటు జేబులో దొరికిన వస్తువులన్నీ ఆయన తదనంతరం తీసి ఒక చోట వేశారు. అందులో కనిపించిన వస్తువులను ఆధారం చేసుకొని కొంత చరిత్ర నిర్మాణం చేయవచ్చు. ఆ కోటులో దొరికిన ఆస్తి వివరం.

1 కంపెనీ నోటీసులు జేబులో అడుగునపడి నలిగినవి కొన్ని
2 విరిగిపోయిన పాళీలు మూడు
3 ఆ వూళ్ళో కొంతకాలంకిందట సబ్ జడ్జీగారింట్లో వివాహ సందర్భంలో పంపిన ఆహ్వానపత్రిక ఒకటి.
4 ఒక చిమ్మట కళేబరము
5 సాలీను కుటుంబసహితంగా
6 కొన్ని సర్కసుకంపెనీ నోటీసులు

కొంతమందికి ఈ జాబితా చూస్తే నవ్వువస్తుంది. కాని నే చెప్పబోయే విషయాన్నిబట్టి మీరు హడలిపోవాలె. ఈమధ్య ఎవరో శాస్త్రిగారు నాటకాల విషయము గాలించి ఒక పుస్తకం వ్రాశారట. ఆ సందర్భంలో ఏనాటకసమాజము ఎప్పుడు పుట్టిందో, ఎప్పుడు అంతరించిందో, అప్పటి ప్రసిద్ధ నటకులెవరో అప్పుడుగల రేట్లవివరము ఇత్యాది విషయము వ్రాశారట. ఆ సందర్భంలో ఒకకంపెనీ ఎప్పుడు పుట్టిందో ఎప్పుడు అంతరించిందో తెలియకవిచారపడుతూ ఉండగా

ఆంధ్ర భారతిలో "విచిత్రమైన వస్తువులు—గంగాధరంగారి జేబులో దొరకనవి" అనేటువంటి ప్రకటనజూచి బెజవాడ వచ్చి ఆ కరపత్రములను విప్పిచూడగా—ఆయనకు బోలెడు విషయం దొరికిందట. ఆ కరపత్రములలో ఫలాని వారు ఫలాని పాత్రవహించినారనే విషయం, అప్పట్లో రేట్ల వివరము నిర్వివాదముగా తేలిపోయింది, ఒకాయన నేనెప్పుడూ కృష్ణుని పాత్ర ధరించలేదని గ్రంథకర్తగారితో వాదించగా ఆయన 1891 సంవత్సరంలో కృష్ణుని పాత్ర ధరించినట్లు కరపత్రములవల్ల నిరూపించి జయము పొందారు. అదిగాక ఆంధ్రదేశ చరిత్ర నిర్మాణమునకు ఆ వస్తువులు ఎంతో ఉపయోగమని కొంతమంది గట్టిగా ఆలోచిస్తున్నారు.

ఆకోటుతో అనేకవ్యవహారాలు జరిగినవి. ఆ కోటుతో ఆయన ఉద్యోగం చేసిన కాలం గడిచింది. ఎన్ని కోర్టుల్లోనో ఆకోటు కనిపించింది. జీవాత్మ పరమాత్మలో ఎలాగైతే సారూప్యం పొందుతుందో అలాగే ఆకోటులో ఆయన వ్యక్తి ఐక్యమయింది. కోటును ఆధారపడి శరీరము ఉన్నదా, శరీరాన్ని ఆధారపడి కోటు ఉన్నదా అనే విషయం తర్క శాస్త్రజ్ఞులకు వదలి వేద్దాం. కాని పొగను చూచి అక్కడ అగ్ని ఉండాలని ఎల్లా ఊహిస్తామో అల్లాగే ఆ కోటును జూచి గంగాధరంగారి ఉనికిని ఊహించవచ్చు. ఇతరులు ఆయనను తెలియనివారు ఉన్నారనుకోండి. మరొకాయన ఆయన విషయమై చెప్పే సమయంలో గంగాధరం గారివల్ల ఈ పని అవుతుంది అంటారు. ఎవరండీ ఆయన అని అడిగితే ఎరగరండీ ఆ పూలుకోటు ఆయనను అన్నారా

ఒహో ఆయనా అని గుర్తించని వారుండరు. ఆయన ఆకోటు అంతకాలం వేసుకోవటంవల్ల కొంతమంది ఆయనను పరిహాసం చేశారు. ఆయన భార్య కూడా—ఆ కోటు పారేసి ఇంకో కోటు వేసుకోండురూ అన్నది.

—ఎందుకే ఆ కోటు పారవేయటం

—ముసలి దయిపోయింది?

—అయ్యో వెఱ్ఱిదానా నాకు ముసలి వస్తువులమీద ప్రీతి. నేనుండేది ముసలి ఇల్లు, కోటు ముసలికోటు. పెండ్లాము ముసలి పెండ్లాము, ఇటువంటి ప్రేమ నీకేలాభం.

అని అన్నాడని ప్రసిద్ధంగా చెప్పుకొంటారు.

కొంతకాలం అయిన తరువాత ఆకోటు విషయమై కోర్టులో తీవ్రమైన చర్చజరిగింది. ప్లీడరు గుమస్తా లంతా కలిసి ఆ కోటు ఎల్లాగయినా వదిలించే ఉపాయం చూద్దామన్నారు. అయితే అసాధ్యమవి తోచింది. ఆ కోటు ఆయనను వదలదు. అనగా ఆయన ఆ కోటును వదలడన్నమాట ఇంట్లో ప్రవేశించి ఆ కోటును దొంగతనంగా తీసికొనిపోయి పారవేద్దామని కొందరు ఆలోచించారు గాని ఆయన వీళ్ళ మీద క్రిమినల్ చర్య జరిపి హైకోర్టుదాకా వెళ్ళుతాడని భయపడ్డారు. ఆఖరుకు వాళ్ళు మంచిమీదనే కార్యం జరపాలని నిశ్చయించుకున్నారు. ఒక డిప్యుటేషన్ బయలుదేరి ఆయన దగ్గరకు వెళ్ళి "అయ్యా మీరీకోటును తొలగించి మరోకోటు కుట్టించుకోవలసింది. దానిక్రింద అయ్యేఖర్చులు మా ప్లీడరు గుమస్తాల సంఘము భరించుకొంటుందిఅన్నారు. దానికి ఆయన నవ్వి ఆ కోటు అంటె ఏమనుకొన్నారేమిటి

అర్జునునికి గాండీవము ఎల్లాగో, కృష్ణునికి సుదర్శనం ఎల్లాగో నాకు ఈ కోటు అటువంటిది. దొరలు సహితం మ్యారేజి గిఫ్ట్ అని ఉంగరం అటువంటిది ఎల్లప్పుడూ ఉంచుకొంటారు. ఇది నా వివాహములో అరణంగా ఇచ్చిన వస్తువు. అని నవ్వుతూ సమాధానము చెప్పాడు.

ఆ కోటు ఇన్నిరోజులు ఆయనకు ఎల్లాసరిపోయిందని కొంతమంది బుద్ధిమంతులకు సందేహం కలిగింది. అప్పుడు ఒక కమిటి తయారయి ఆ కోటును తెప్పించి పరీక్షించారు. చాలాసేపు వాదనలు జరిగినవి. ఆఖరుకు తేలిన విషయము "ఆకోటు ఆయన కుట్టించుకొనేటప్పుడే వొదులుగా కుట్టించుకొన్నాడు, రెండోది, నడుము దగ్గరా, పక్కలనూ, కుట్లు విప్పి కోటు యొక్క వైశాల్యాన్ని వృద్ధిచేసినట్లు తెలుస్తున్నది. ఎల్లాగంటె మిగతా భాగములు నల్లబడి బాగామాసినవి. కుట్లువిప్పిన ప్రదేశం అంతగా మాయలేదు."

అక్కడక్కడ కోటు బొక్కలుపడ్డది, ఆ రంధ్రములు కోటు యొక్క సౌందర్యానికి లోపం తెచ్చినవి. అని ఆయన ఎప్పుడూ అనుకోలేదు. తూట్లుపడ్డప్పటికిని వానివల్ల క్రొత్త ఉపయోగం కలిగింది. దేహానికి గాలిసోకింది.

## 2

ఇట్లా జరుగుతూ ఉండగా ఒకరోజున ఆయనకు ఒక కొత్త కోటు కుట్టించుకోవలెనని బుద్ధిపుట్టింది. ఎందుకు పుట్టిందీ అంటే నేనేమి చెప్పేది, ఆ వేళావిశేషం. ఒకరు కుట్టించుకోమని ప్రోత్సాహపెడితే వినే రకం కాదు. ఆయ

నకే బుద్ధిపుట్టింది. దాని ధర్మాన ఇంటివద్దనే ఏ గుడ్డ కుట్టించుకొందామా అని మనస్సులో ఆందోళనపడ్డాడు. మనస్సుకు ఏమి సమాధానం కుదరలేదు. భార్యనడిగిచూస్తే ఆమె "నాకేమి తెలుస్తుంది. ఎవరైన మగవాళ్ళను అడగండి" అన్నది. ఇద్దరు ముగ్గురు స్నేహితుల దగ్గర ఆ విషయమై ప్రస్తావన తెచ్చాడు.

ఏమండీ ఇప్పుడేమైన మంచి కోటుగుడ్డలు అమ్ముతున్నవి?

ఒక ప్లీడరు గుమాస్తా అన్నాడు. నదురు బెదురు లేకుండా "ఎప్పుడు మంచికోటుగుడ్డలు అమ్ముతునే ఉంటవి. మీరు కుట్టిస్తారా ఏమిటి చెప్పండి. ఒకటో రకం గుడ్డ యిప్పిస్తాం ఒకరోజు పనిమానుకోని అయినా సరే"

ప్లీడరుగారు ఏబ్బో ఏదో "అనుకొంటున్నాను. అయినా ఇప్పుడు కాదులెండి." అన్నాడు.

గుమాస్తా ముఖం చిట్లించుకొని "చచ్చాము. ఇప్పుడు కుట్టిస్తారనుకొని సంతోషపడ్డా ననుకొన్నా"నన్నాడు.

గంగాధరంగారికి కోటు కుట్టించుకోవలెనని నిశ్చితాభిప్రాయం కలిగింది. ఏమైనా కానీమని తెగించాడు. ఆకొత్త కోటు వేసుకొని చేతులో నల్లకర్ర పట్టుకొని సాయంత్రం షికారు వెళ్ళితే ఎల్లా ఉంటుందో అని ఊహించుకొని సరదాపడ్డాడు. ఆ సౌఖ్యాన్ని ఊహించుకొని గుటకలు మింగాడు.

బజారులోకి వచ్చాడు. అంతా ఆయనను గౌరవించి పిలిచారు. ఇదివరలో తనవద్దకు ఏదో కోర్టుపనిమీద వచ్చిన బట్టల దుకాణంమీదికి వెళ్ళాడు షావుకారు మంచిమంచి రకము కోటుగుడ్డలన్ని గబగబాతీసి ముందు పడేశాడు.

అందులో ఒక రకం గుడ్డతీసి
ఇది ఇచ్చేమాట చెప్పవోయి.
ఎబ్బె నాతోడ డీ——
ఆహా ఏమైన తగిద్దూ.
ఎబ్బె! మీకేమైనా ఎక్కువ చెప్పాననా అభిప్రాయం అందరికంటె ఒక అణా తక్కువ చెబుతానుగాని ఎక్కువ చెబుతానా. రాకరాక వచ్చారు. అని లొడలొడ అనేశాడు కోమటి.

పంతులుగారికి ఆ మాటలు తెలియలేదు.
గుడ్డ అయినా ఏమంత...” అన్నాడు పంతులు.
“మీరు అల్లా అనాల్సిన పనిలేదండీ. ఈ రకం గుడ్డ ఈ వూళ్ళోనే లేదండి.”
“మరి నీకెట్లా వచ్చింది.”
“బొంబాయి నుంచి తెప్పించానండీ తమబోటి గొప్పవారికి కావాలని మిగతా దుకాణాలల్లో రెవికగుడ్డలేకానీ గొప్ప వారికి కావలసిన మంచి రకాల గుడ్డలుండవండీ.
పంతులు మళ్ళీ మాట్లాడలేదు. కుట్టుపనివానిని పిలిపించి ఎంతకావాలో పట్టవోయి. గుడ్డమట్టుకు అనవసరంగా తియ్యకేం. నీకు కూలి కావాలంటే ఒక అణా ఎక్కువ పుచ్చుకో అన్నాడు.

## 3

విదియా సోమవారం రోజున మంచిదని కోటుకు పసుపురాసి కోర్టుకు బయలుదేరినాడు. పంతులు కోటు వేసుకొనే సమయాన పన్నెండు గంటలు టాంగ్ టాంగ్‌న

కొట్టారు, ఇది విజయసూచకంగా గ్రహించి కోటు ధరించినాడు. అక్కడక్కడ స్కూలు పిల్లలు గుంపులు గుంపులుగా జేరి యేమిటో గుసగుసలు మొదలుపెట్టారు. మరికొందరు ఆయన వంక తేరిపార చూశారు. ఆఫీసుకు వెళ్ళిన కొంచెము సేపటికి ఆడవాళ్ళు గుంపులు గుంపులుగా బయలుదేరి ఆయన భార్యను కలుసుకొని.

—ఏవమ్మోయి పార్వతమ్మా? మీ ఆయన క్రొత్త కోటు కుట్టించాడే. కనులపండువగా ఉందిగాదు! ఇంకేం నీవు కూడా ముస్తాబుగా, నవమన్మధుడు లాగ ఉన్నాడమ్మా నీ భర్త అన్నది.

—మరొకామె మీ ఆయన క్రొత్తకోటు వేసుకుంటే యేంత బాగున్నాడమ్మా అన్నది,

అంతట పార్వతమ్మ నవ్వుతూ ఏమమ్మా అంతా అల్లాగే అంటున్నారు. దిష్టికొడుతుందేమో అన్నది. తూర్భై యేండ్ల ఆయనకు దిష్టియేమిటమ్మా అని మంగమ్మ నవ్వుతూ అన్నది.

ఆ రోజు కోర్టు కళకళ లాడింది. ప్రతి గుమస్తా సంతోషించాడు. ప్లీడర్లు ఒకొక్కరుగా వచ్చి ఆయనకు పేకుహాండు యిచ్చారు. జడ్జిగారు యీ రోజున గంగాధరంగారు రా లేదేం, అన్నారు. వచ్చారు అరేమండీ అన్నాడు గుమాస్తా. ఆయనవేపు చూపుతూ. ఆహాయేమిదీ

మా కన్నులపండువ అన్నాడు జడ్జి. అంతా ఫక్కున నవ్వారు. ఆ రోజు సెలవు యిప్పిస్తే బాగుంటుందని యెవరో అన్నారు. జడ్జిగారా మోదించి వెంటనే కోర్టు మూశారు. అందరూ సంతోషంతో యింటికి వెళ్ళారు.

ఒక ప్లీడరు గుమాస్తా యింటికెళ్ళి చొక్కాలు విడుస్తుంటే భార్య వచ్చి 'యివ్వాళ యేమి మా భాగ్యం యింత వేగం దర్శనమిచ్చారు.' అంటే మా ప్లీడరుగారు కొత్త కోటు కుట్టించుకున్నారు. అందుకని శెలవు అని, ఆరోజు భార్యతో చాలాసేపు ఆయన కులాసాగా మాట్లాడాడట. ఏ రోజు అయినా. ఈయన ఇంతసేపు కులాసాగా భార్యతో మాట్లాడినాడా. లేదు అంతా గంగాధరంగారి కోటు చలువ. రోజంతా ప్లీడరు గుమస్తాలకు భార్యలతో సరదాగా ముచ్చట్లకు అవకాశం చిక్కింది. పాపం. ఇలా ప్లీడర్లు, ప్లీడరు గుమస్తాలు గంగాధరంగారి "కోటు" పేరును ఆ రోజంతా స్మరించుకుంటూ గడిపారు.

ఇంతలో ఒకరోజు జడ్జిగారింట్లో నాళ్ళ అమ్మాయి పుట్టినరోజు సందర్భంగా రాత్రిపూట విందుకు పిలిచారు. చాలామందిని జడ్జిగారు. గంగాధరం గారు ఆ కొత్త నల్ల కోటును ధరించి జడ్జి గారింటికి బయలుదేరాడు. రాత్రి పూట ఆ అంధకారంలో ఆ క్రొత్త కోటు లీనమయి పోయింది. తెల్లని గడియారపు గొలుసు మాత్రం మెరుస్తూన్నది. కోటు మట్టుకు కనిపించలేదు. గంగాధరం గారికి

భయం వేసింది. కోటు ఉందా లేదా అని? ఉంటే ఎందుకు కనుపించదనుకొన్నాడు. అజ్ఞానాంధకారం మనలను ఆవరించుకొనడంవల్ల ఎల్లాగైతే భగవంతుణ్ని చూడలేమో అలాగే యీ అంధకారంలో తన కోటు కనుపించలేదనిఅనుకున్నాడు. జేబులో నిప్పుల పెట్టె వెలిగించి చూచేసరికి నిగనిగలాడుతూ కనుపించింది. ఆహా యింతేగదా! అన్నాడు ఇల్లాగా జ్ఞానం అనే దీపంఅజ్ఞానాంధకారాన్ని పటాపంచలు చేస్తుందిగదా అనుకొన్నాడు. ఆ వెలుగులో ఆ కోటు మెరుస్తున్నది. వేగంగా నడిచి జడ్జిగారింటికి చేరాడు. గంగాధరం గారిని చూచివిస్తుళ్ళు వేశారు.అంతా కోట్లువిప్పి మడిగట్టుకున్నారు. గంగాధరంగారు కోటువిప్పటానికి సందేహించారు.ప్రియమైనవస్తువును విడవటానికి ఎవరికైనా కష్టం కలుగుతుంది. కోటు మరల ప్రక్కనే పెట్టుకొని భోం చేద్దామా అనుకున్నాడు. మరల తన ఉద్దేశాన్ని మార్చుకున్నాడు. ఎల్లాగైతేనేమి! కోటు విప్పాడు. అన్ని కోట్లు వంకెలకు తగిలించి వున్నవి. కొన్ని నల్లవి కొన్ని తెల్లవీ వాటితో ఈ కోటు నుంచటానికి అతనికి మనసు ఒప్పలేదు. దానిని వేరేగదిలో జాగ్రత్త చేశాడు.

భోజనశాలలో భోజనానికి కూర్చున్నాడు. విందు జరుగుతున్నది. భోజన సమయంలో గంగాధరంగారి పంచప్రాణాలుకోటుమీాదనే ఉన్నవి.భోజనానంతరం కోటుకొరకు వేగంగా గదిలోకి వెళ్ళాడు. వంకెన కోటులేదు. గుండెలు

దడదడ కొట్టుకున్నాయి. క్రింద పడ్డదేమోనని అక్కడ చూశాడు. ఎక్కడా లేదు. ఇంకేముంది కొంప మునిగిందని కెవ్వున కేక వేశాడు. ప్లీడర్లు అంతా వచ్చారు.ఇల్లంతా వెతికారు. దొడ్డి అంతా శోధించారు. ఇదివరలో పోయిన వస్తువులు ఏమేమో కనిపించినాయి గాని కోటుమట్టుకు కనిపించలేదు. నౌకర్లను బెదిరించాడు. వాళ్ళు ఏడుపు మొహాలతో ఏమీ యెరగమని చెప్పారు. ఒక ముసలివాడు "బాబూ, మీరు చెప్పినట్లు నేను హాలులో కూర్చుని అయ్యోర్ల గుడ్డలన్నీ కాపాడుతున్నాను. ఆయన కోటు యీడుంటే యాడికి పోయేదికాదు." అన్నాడు గంగాధరం గారు తన కోటు అక్కడ పెట్టక వేరే పెట్టినందుకు తన్ను తాను నిందించుకున్నాడు. ఎవరో దొంగిలించినారని నిశ్చయించుకున్నాడు. మూడువందల ఎనభయ్యో సెక్షన్ ప్రకారం దొంగ మీద క్రిమినల్‌గా చర్య జరపవచ్చునని తోచింది కానీ అసలు దొంగ ఏడి! వర్షం చూసి తొడుక్కున్నా కోటు ఇలా జరిగిందేమబ్బా అని సందేహం కలిగింది.

ఆ కటిక చీకటిలో ఒక్కడే బయలుదేరాడు. పిచ్చివాడిలాగ పరుగెత్తడం మొదలుపెట్టాడు.దూరాన ఒకవ్యక్తి కదులుతున్నట్లున్నది. పరుగెత్తిపోయి కలుసుకున్నాడు. అతను దొంగ అని అభిప్రాయపడ్డాడు కాని, అతను యితనికి స్నేహితుడే, అదేమిటిగంగాధం ఇల్లా వచ్చావు. అని ఆశ్చర్యముతో అడిగాడు.

ఇంకేముంది నాయినా, నా కొత్తకోటు ఎవరో ఎత్తుకెళ్ళారు'' అని దీనంగా అన్నాడు గంగాధరం. పాపం ఆ స్నేహితుడికి విచారం వేసింది. ఎవరికి విచారం వెయ్యదు. ఏ మానవుని హృదయం కరగదు! ముప్ఫైయేండ్లకు ముచ్చటగా కోటు కుట్టించుకుంటే ఆ కోటు పోవడమా. నేను వస్తానుపద దొంగను పట్టుకుందాము' అన్నాడు. ఇద్దరు కలిసి ఆ చీకటిలో ఆ వూరంతా వెతికారు. దొంగ కనిపించ లేదు. ఊరంతా ఈయన కోటు పోయిన సంగతి తెలిసింది.

బెజవాడ వీధులలో చినిగిపోయిన బట్టలుకట్టుకొని పాత వూలు కోటు వేసుకొని పాలిపోయిన మొహంతో తిరుగుతున్నాడు, చింతా ముద్రితతలలాటంతో, అశ్రుజలపూరిత నేత్రాలతో ఆయన కనుపించుతాడు. ఆయనను జూచికంట తడిపెట్టని మానవుడులేడు. గుంట వెధవ లెవరో ఆ కోటు దొంగిలించి ఉంటారు. వాడి...తగులడ యింత యీర్ష్య? యింత తుంటరితనమా? ఒకవేళ వాళ్ళు తమాషాకు తీసుకొని వెళ్ళి తిరిగి గప్‌చిప్‌గా తన యింటిలో వంకెలకు తగిలించుతారేమో అన్న ఆశ ఆయనను ఎంతకాలమో బాధించినది. ప్రొద్దున్నే లేవడంతోనే నేరుగా వంకెల దగ్గరకు నడచి చూచేసరికి కోటు కనిపించదు. మానవుడికి! రోజు యిల్లాగే జరిగింది. ఆరోజు నిరుత్సాహంతో వెళ్ళిపోయాడు.

ఆ నల్లకోటు ఆయన కళ్ళల్లో మెలుగుతూ ఉండేది. నల్లగా మెరుస్తూ నిక్షేపంలాగ ఉండేకోటు ఎల్లాగా మరిచి

పోవటం. మరిచిపోదామన్నా మరుపురాదు. రేయింబవళ్ళూ ఆయనకు ఆ కోటు కనుపించేది. ఒకప్పుడు జడ్జిగారి వంకెల మీద కనుపించేది. మరొకప్పుడు తనదొడ్లో జామచెట్టుమీద కనుపించేది. మరొకసారి తన కళ్ళముందు నడిచేది.

ఆయనకు స్వప్నంలో ఆ కోటు అనేక రూపాలతో కనుపించింది. ఒకప్పుడు ఆయన కాకోటు కృష్ణలో పడిపోయి నట్లు మెల్లగా మునుగు తున్నట్టూ తాను దానికోసం నీళ్ళ లోనికి పోగా కాలు జారినట్లు కల. ఇంకోమారు ఆ కోటే బజారులో నడుస్తున్నట్టు కల. మరొకమారు అది ఆకాశంలో విమానంలా ఎగిరిపోతున్నట్లూ, దాని అంచులు గంధర్వులు పట్టుకొని తీసికొని పోతున్నట్లు కల. మరొకమారు ఇంకొక కల. ఆ కలలో పంతులు కోటు దొంగిలించిన దొంగను వెతుకుతూ వెళ్ళి సప్త సముద్రాలు దాటాడు. ఇంద్రలోకం చేరాడు. అక్కడ దొంగ కనిపించాడు. అతను ఆ కోటు వేసుకొని రంభా తిలోత్తమలతో సౌఖ్యం అనుభవిస్తున్నాడు. పంతులుకు వళ్ళుమండింది. తుపాకిబారుచేసి వాడిని 'ఢాం'న కాల్చివేసి ఆ కోటును లాక్కున్నట్లు అప్పుడు దేవతలు పుష్ప వర్షం కురిపించినట్లు కల కన్నాడు. నిద్రలేచేసరికి అతని కళ్ళలో ఆనందబాష్పాలున్నవి.

ఆయన బజారులో వెళ్ళుతూ హఠాత్తుగా ఆగి ఒకరి కోటు చూచి అది తనదేమో అని భ్రమించేవాడు. మళ్ళీ ఏమనుకు నేవాడో ఏమో తిరిగి తనదారే వెళ్ళేవాడు.

# తేనీరు

—కాంతం, కాంతం, తలుపు!

లోపలినుంచి కాంతం వచ్చి తలుపుతీసి తేనీళ్ళు తయారయినవి- అన్నది.

—తీసుకురా.

—లోపలికి దయచేయవచ్చు.

కాంతానికి టీ విషయమై విసుగు. నేను ఉపాధ్యాయ వృత్తిలో ఉండి కొద్ది వేతనంతో ఎట్లో సంసారము గడుపుతున్నాను. ఏదోవస్తే అందులోనే సంసారము గడుస్తున్నది. ఇందులో హవ్యం కవ్యం అల్లా ఉంచగా ఎన్నో ఖర్చులు ఇటువంటి సమయంలో సొమ్ములు చేయించలేదని కాంతానికి విసుగు.

ఈ స్థితిలో ఈ బాధ పడలేక ఒకరోజు జమాఖర్చు ముందు వేసుకొని కూర్చున్నాము. ఏదైనా ఖర్చు తగ్గించటానికి వీలవుతుందేమో అని మా ఆశ.

పైనుంచి క్రిందికి పట్టీ చూచాను. కొన్ని అవసరపు ఖర్చుగా కనిపించినవి. బియ్యం ఉప్పు పప్పు విషయంలో వివాదం లేదు. మిగతా వాటిలో కొంచెము ఘర్షణ జరిగింది. అవి రెండు సబ్బుబిళ్ళలు- ఇవి మానేద్దాం. అని నేనన్నాను.

—సబ్బుబిళ్ళలు మానవలసిందే. అయ్యే ఖర్చులు అవుతుంటె దీనికే వచ్చినది.

—మరి ఏమి తగ్గించమంటావు.

—ఏమో నాకేమి తెలుస్తుంది.

—అవును పాపం నీకేమి తెలుస్తుంది, ప్రతినెలా రెవిక గుడ్డలు కొనటం మటుకు తెలుస్తుంది.

—కోరిన సొమ్ములు లేవు సరిగదా, ఇంత కోరినగుడ్డ అయినా కొనుక్కోవద్దు అంటారా ఏమిటి?

—మరి ఏమిటి చేయటం?

—ఏమిటి చేయటమా? టీ నీళ్ళు మానగూడదూ. కావలసినంత మిగులుతుంది. మూడు పూటలా ఆ నీళ్ళే తాగుతారాయె. ఎక్కడి డబ్బు అదే మింగుతుంది.

—ఆ—టీ యే మానటం. అది తాగకపోతే ఏం తోచదు.

—ఎందుకు తోచదూ? ఏదో పని కల్పించుకొంటే.

—మనస్సు స్థిరంగా ఉండాలా పనిచేయటానికి.

—పట్టుదల ఉంటేసరి. ఈ పని మానివేయాలి ఈపని చేయాలి అని. ఈ నీళ్ళేనా ఏమిటి మనిషికి పట్టు యిచ్చేది.

—అందుకనే మానెయ్యలేకుండా వున్నాను.

—ఏం విడ్డూరమండీ! నేను మాన్పించనా?

—నేను మానలేను. నీవు మాన్పించనూ లేవు.

—మానరూ! మాన్పిస్తే.

—పందెం.

—ఏమిస్తారు మీ చేత మాన్పిస్తే.

—ఏమి అడిగితే అదే.

—సరే చూడండి నా తమాషా.

కాంతం బహుటక్కరు. ఏమి టక్కు పన్నుతుందో అని భయం వేసింది నాకు. కాంతం పట్టినపట్టు సాగించుకొనే

మనిషి. ఆవిడ టక్కులు మన మూహించ లేము. ఇదివరలో నాకు అనుభవం కాబట్టి తగిన జాగ్రత్తలో ఉండటానికి ప్రయత్నపడ్డాను. ఆ రోజుననే మా వదినగారు కూడా వచ్చింది. వారిద్దరికి గుసగుసలు రహస్య ప్రసంగములు ఎక్కువయినయి. ఈ కొంటె పిల్ల నన్నేమి అవమాన పరుస్తుందో గదా అని భయం వేసింది. వారిద్దరు కలిసి ఏదో ఒక పెద్ద కుట్ర పన్నుతున్నారని మాత్రం నాకు గట్టిగా నమ్మకం గలిగింది. నన్ను జూచి పలుమారు నవ్వటము నా నమ్మకాన్ని దృఢపరిచింది.

ఆడవాళ్ళు యెంతకైనా సాహసులే. లోకంలో అనేక యుద్ధాలకు స్త్రీ కారణం. లోకంలో మాట ఎందుకు? మా యింట్లో మా కాంతం మూలంగా ఎన్ని యుద్ధాలు జరిగినవి. ఎన్ని మార్లు సంధి కుదిరింది. ఆడదాని ప్రోత్సాహం వల్ల కాదూ ఆదిపురుషుడు పాపం జేసింది!

ఆరోజు నామీద ఏదోకుట్ర పన్నుతుందనుకొన్నాను. కుట్రపన్ని ఏం జేస్తుంది అనవచ్చును. ఆ కుట్రవల్ల తనపని నెరవేర్చుకోవటమేగాక నన్ను అవమానపరుస్తుంది.

నాజాతక ఫలం అటువంటిది. గోపాలపురం నుంచి జాతక ఫలం సంవత్సరానికి తెప్పించా. అందులో "యీ నెలలో నీకు గొప్ప అవమానం జరుగనున్నది" అని కూడా

వ్రాసి ఉన్నది. ఇంతగా భయపడటానికి కారణం ఏమిటంటే ఇది వరలో అనేక మార్లు అవమానం భరించాను. జుట్టు మంచానికి కట్టి వెయ్యటం, తాంబూలంలో చింత గింజలు పెట్టటం, లేకపోతే సగం కొఱికిన వక్కలు ఉంచటం, జ్ఞాపకం వచ్చినవి.

అందుకని తగిన జాగ్రత్త పడ్డాను. నిద్ర లేవడంతోనే చప్పున లేవక ముందు జుట్టు స్వేచ్ఛగా ఉందీ లేనిదీ విచారించి ఝూడించి ముడివేసుకొని క్రింద ఏమీ లేకుండా చూచుకొని దిగాను. ఇప్పటికి ఒక గండం గడచింది.

కాని దానితో ఏమయినది. ఇల్లు అలకంగానే పండుగ కాలేదు. ఎన్నో గంటలు జరగాలె. క్షణంలో నన్ను అవమానపరచే శక్తి గలది కాంతం. ఆ రోజు అంతా జాగ్రత్తగా ఉన్నాను. భోజన సమయములో కూరల విషయమై పరీక్షించి మరీ తిన్నాను. పులుసులో ముక్కల విషయమై ప్రత్యేకంగా జాగ్రత్త పడ్డాను. మధ్యాహ్నం నిద్రపోవటం మాని ఏదో పుస్తకం ముందు వేసుకొని దీక్షగా చదువుచున్నట్లు నటిస్తూ అక్క చెల్లెండ్ర ప్రసంగాలు వినేటందుకు ప్రయత్నించాను. వాళ్ళు అవతల గదిలో ఉండటం వల్ల నాకు సరిగా వినిపించలేదు. కాని కొన్ని ముక్కలు అప్పుడప్పుడు వినిపించనవి.

—నిజంగా



—మరేమిటి

—దాని తరువాత నన్ను నిన్ను గూడ తిడితే

—తర్వాత వాళ్ళిద్దరూ గుసగుస లాడారు. నవ్వుతూ మావదినగారు

—పాపం భరించలేడేమో అన్నది.

—నే జేస్తానుగా అని కాంతం ధైర్యం మొలికే కంఠముతో పలికింది.

దీని తరువాత మరేమో రహస్య ప్రసంగములు జరిగినవి. అవన్ని ఒక పెద్ద నవ్వుతో ముగిసినవి. నాకు ఆదుర్దా ఎక్కువయింది. కాంతం వైఖరి జూస్తే నాకేమాత్రం మనశ్శాంతి లేదు. వారి సంభాషణవల్ల ఏదో భరింపరానిది నామీద వేస్తారని బోధపడ్డది. దానికితోడు కాంతం ముసిముసి నవ్వులు నా అనుమానాన్ని మరీ బలపరిచినవి. ఆ నవ్వులెందుకు! ఆ సంతోషమో! ఆరహస్య ప్రసంగాలెందుకో నాకు బోధపడలేదు. కాంతంలో రెండు భావాలు కనబడుతున్నవి. ఒకటి కొంచెం భయం. రెండోది ఒక విధమైన సంతోషము. ఇట్టి మిళిత భావ ప్రకటన కుట్ర కోసం అని ఎవరు గ్రహించలేరు. ఆ కుట్రవల్ల నాకవమానం కలుగుతుంది. నేను తిడతానేమో అని భయం. తాను తప్పక గెలుస్తానని సంతోషం. అయితే అంత భరింపరాని అవమానమా? భరింపరానిది ఏమిటి చెప్పుమా? అని ఆలో

దించాను. ఏమి బోధపడలేదు. ఆ(. నేను భరింపలేని కార్యాన్ని చేయటానికి కాంతం పూనుకొన్నది. వదినెగారు జంకుతున్నది. ఆ.

## 2

ఇల్లా ఆలోచిస్తూ కుర్చీలో కూర్చున్నాను. ఆలోచనలో నుండగా నిద్రపట్టింది. ఇంతలో కాంతం వచ్చింది. కుర్చీ వెనుకగా వచ్చి నా కళ్ళు మూసింది. నేను ఉలిక్కిపడి లేచి చేతులు విదిలించికొన్నాను. కాంతం నా ఎదుటికి వచ్చి నిలుచున్నది.

—ఏమిటి కొత్త ఎత్తు ఎత్తుతున్నావు. మీ అక్కయ్య నీవు కలసి నా మీద ఏదో కుట్ర పన్నుతున్నారు. ఏమిటో చెబుదూ?

—మీవన్నీ టక్కరు మాటలు - ఊరుకోండురూ... ఈ మాట కేమిగాని నాకు మురుగులు చేయించరూ.

—చేయిస్తానులే.

మీరు ఎప్పుడూ అల్లాగే అం గు. నేను బతికి ఉండగా...

—అల్లా అంటేనే నాకు కోపం వస్తుంది.

—మరి నాకు మురుగులు చేయించండి.

—ఎప్పుడు.

—ఈరోజే.

—సరి బాగానే ఉంది పట్టు.

—చూడండి కొనిపించక పోతే.

—నేను చేయించ నంటే కొట్టి చేయిస్తావా అన్నాను.

కొట్టటం అంటే జ్ఞాపకం వచ్చింది. మా యిద్దరికీ మరీ చిన్నతనంలో వివాహం అయింది. వివాహంలో ఒకరోజున గంధం పూయించారు. నాకు గంధం పూయటానికి పెండ్లి కూతురు వచ్చింది. మొదట వద్దు అన్నాను. మావాళ్ళంతా పూయించుకోమంటే సరే అని మెడ ఎత్తాను. మెడ క్రింద పూస్తున్నట్లే పూసి చెంపమీాద లెంపకాయ కొట్టింది. అందుకని కొడతావా ఏమిటీ అని ఎప్పుడూ ఎత్తి పొడుస్తుంటాను.

కాంతం సొమ్ము విషయమై గట్టిపట్టు పట్టింది. టీ మానిపిస్తానని పంతం గట్టింది. రెండు పనులు ఒకమారే నెరవేర్చగలదు. ఎల్లాగయితే నేమి ఆ పగలు గడిచింది. రాత్రి స్నానానికి లెమ్మనారు. రాత్రి గడిస్తే బ్రతికినట్లే. ప్రతి విషయంలోను జాగ్రత్తపడ్డాను. భోజనానంతరము తమలపాకులు వేసుకొని వచ్చింది కాంతం. ఆ యీానెలతబుకులోనే

పెట్టుకొని వచ్చింది. ఈనెల తబుకు జూచినప్పుడు మా ప్రథమ పరిచయం స్ఫురించింది. మరొక్కమారు ప్రేమ వాహిని ప్రవహించింది. "కాంతం" అని దగ్గరకు లాగు కొన్నాను. కాంతం చిరునవ్వు నవ్వి విదలించుకొని వెళ్ళి పోయింది. అల్లరి జంతువని నాలో నే ననుకొని ఒక విసి గింపు నవ్వు నవ్వుకొన్నాను.

రాత్రి పడుకొన్నాను కాని నేను భరింపరాని దేమిటా అనే శంక బాధిస్తూనే వుంది. ఆట్టే నిద్రపట్టలేదు, తెల్ల వారు ఝూాముున మెళకువ వచ్చింది. కాంతం ఓడిపోయింది. నన్ను ఏమి అవమానం చెయ్యలేదని ధైర్యం వచ్చింది. అప్పుడు బాగా నిద్ర పట్టింది. నేను మళ్ళీ మేలుకొనేటప్ప టికే సుమారు ఎనిమిది గంట లవుతుంది. "బతికానురా" బాబూ అనుకోని ఒళ్ళు తెలియని సంతోషంతో మంచం చప్పున దిగాను. కాలు క్రింద పెట్టానో లేదో భగ్గుమన్నది. భగభగమనే మంటలో కాలుపెట్టినట్లు తోచింది. కాంతం అని కేక వేశాను. కాంతం వచ్చి

— అబ్బా! చూచి దిగవద్దూ—ఆపాడు టీ కప్పు అక్కడ మార్చిపోయినాను— చూడక ఆ వేడి తేనీరు కాలి మీద పోసుకున్నారు. ఆ పాడు తేనీళ్ళు తాగవద్దంటే వినరుగా. ఒక సంవత్సరం టీ మాని వెయ్యండి. ఇటువంటి చక్కని మురుగులు వస్తవి. (అని తన ముద్దు చెయ్యెత్తి నాకు చూపింది)

—ఎక్కడివి అన్నాను.

నిన్న మా అక్కయ్య తెచ్చింది. సుబ్బమ్మకు కావాలని చేయించుకొని తీసుకుని పోతుంటే నేను తీసికొన్నాను. ధర మీరు ఒక్కమారు భరించలేరని అప్పుడప్పుడు యిచ్చేట్టు ఏర్పాటు చేశాను.

"అవును దారులు కొట్టే రకం మీది" అన్నాను. కాంతానికి ఆ బంగారపు మురుగులు ఎంతో అందంగా ఉన్నవి. నీ చిట్టి చిట్టీ చేతులకూ-బంగారుగాజు లందమే"- అనే పదం జ్ఞాపకం వచ్చింది. మురుగులు పెట్టుకొన్న ఆ చక్కని చేతికొఱకై. ఒక సంవత్సరం టీ మానితే నేమి అనుకొన్నాను. హేమకంకణముతో ముద్దులు మూటగట్టుతున్న ఆ శిరీష కోమల హస్తాన్ని పైకెత్తి ముద్దుబెట్టుకోబోయాను. ఆ కొత్త మురుగులు రాచుకొని కాబోలు నా చెంప చిటుక్కుమన్నది. నేను నవ్వుతూ పులకించిన ఆ స్వప్న హస్తాన్ని వదలినాను. కరకంకణములు ఘల్లుఘల్లుమన ఆమె కిలకిలా నవ్వుతూ పరుగెత్తినది. నా కళ్ళు అప్రయత్నంగా మూతలు పడ్డవి. నేను కళ్ళు తెరచి చూచే సరికీ నా మంచం క్రింద టీ కప్పు పగిలి ముక్కలై ఉన్నది.

# వృ దా చీ ర

—ఏమే, కాంతం, రేపు సుబ్బి వస్తుంది.

—ఏ సుబ్బి.

—మా అత్తయ్య కూతురు.

—ఎందుకో?

—ఎందుకంటావేమిటి మొన్న మీ అక్కయ్య ఎందు కొచ్చింది.

—చూడటానికి.

—అల్లాగే ఇది.

—ఎవరిని చూడటానికి?

—నిన్ను

—నన్నెందుకు చూడటానికి వస్తుందీ మీరు ఉండగా అన్నది కాంతం.

—నేను సుబ్బిని చూచి చాల కాలమైనందున ఉవ్విళ్ళూరుతున్నాను ఆమెను చూడటానికి. మరునాడు తెల్లవారుఝామున నాలుగు గంటలకు తెల తెలవారుతుండగా సుబ్బి మా యింటిముందు బండీ దిగింది. ముందు ఎదురుగా కాంతం వచ్చి పలుకరించి ఆమెను యింట్లోకి తీసుకొని వెళ్ళింది. నేను మాట్లాడక ఊరుకున్నాను. సుబ్బి యింత చక్కని దౌతుందని ఎప్పుడూ అనుకోలేదు. పల్లెటూళ్ళో పెరగటం చేత ముఖము బస్తీ పిల్లలలాగు కాంతి

హీనంగా లేదు. కన్నులు కాంతులను వెదజల్లుతున్నవి. బింబ ఫలములబోలు అధరమూ, నొసట పెద్ద సాదుబొట్టూ ఆమె సౌందర్యమునకు వన్నె దెస్తున్నవి.

బాల సూర్యుని అరుణరాగ ప్రసారము ఆమెకొక వింత సౌందర్యమును కలిగించినది.

నేను సుబ్బమ్మను చూచి నిలువున నిలబడ్డాను. నోరు విప్పి పలుకరించలేక పోయినాను. ఆమె సౌందర్యము నన్ను వశపరచుకొన్నది. సౌందర్యమునకు వశీకరణశక్తి ఉందని నేను తెలిసికొన్నాను. సౌందర్య శకటమునకు నేను తెంప రాని గొలుసులతో బంధింపబడ్డాను. ఆ సౌందర్యమును ఆస్వాదించిన కొద్దీ ఆకలెక్కువ. తాగినకొద్దీ దాహ మెక్కువ.

సుబ్బమ్మ కాంతమ్మలు ఒకరికొకరూ సహాయము చేసుకొంటూ వంట తయారుచేశారు. సకాలానికి సుబ్బమ్మ "బావగారూ వంట అయింది. అక్కయ్య స్నానం చేయ మంటున్న"దని మృదుమధుర స్వరంతో కోయిలలాగు పలికింది. ఆ పలుకులు నా హృద్విపంచిపై తగిలినవి. తంత్రులు కదలి మోగినవి. నిశ్చేష్టుడనయి చూస్తూ స్వప్నావస్థలో ఉన్న నన్ను సుబ్బమ్మ మళ్ళీ లేపింది.

—స్నానానికి లేవచ్చునంటున్నది అక్కయ్య.

—సరే, వస్తాగాని అత్తయ్యకు ఉబ్బసం నయమా!

—ఏం నయం బావా! అల్లాగే బాధపడుతున్నది. వేసవి కాలం నాలుగు నెలలూ కాస్త తెరిపి. వానకాలంలో

బాధ చూడలేము.

—తరువాత ఏమాటా తోచక నేను "తెనాలిలో మీ అత్తగారు కులాసాగా ఉన్నారా?" అని అడిగాను.

—ఆ విషయమై సుబ్బమ్మకు మాట్లాడటం ఇష్టం లేక కాబోలు "అలాగే" అని మూడు అక్షరాలతో కొట్టి వేసింది.

—నిన్ను జూచి చాలారోజు లయింది. ఇంతలో ఎంత పెద్దదానవయినావు.

—మీకు నా మీద దయ వుంటే

—అని ఏమో చెప్పబోతుండగా కాంతం గుమ్మంలో కనిపించింది. ఏమిటో మరదలితో సరాగాలాడుతున్నారు! భోజనానికి లేవండి ముందు. తరువాత మీ యిష్టం. అని చురుకు గొంతుతో అన్నది.

నాకు కాంతం ఇట్లా రావటం ఇష్టం లేకపోయినా వెంటనే భోజనానికి లేవక తప్పిందికాదు. నేను "అది కిన్నెర స్వరం. ఇది బొంగురుగొంతు" అని ఏమోగొణుక్కుంటూ లేచి స్నానం చేసి భోజనం దగ్గిర కూర్చున్నాను.

సుబ్బమ్మ గడప అవతల భోజనం చేస్తున్నది. కాంతం వడ్డిస్తున్నది. నేను సుబ్బిని చూస్తూ భోజనం చేస్తూ న్నాను. అలాచేయటం తప్పని తెలుసును. కాంతం అనుమాని స్తుంది. నేను భయపడ్డాను. కాని ఏమి చేయగలను? సౌంద ర్యము వశపరచుకొని అట్లా యాడుస్తున్నది. కాంతం వైపు చూసి ఎందుకో ఒక చిరునవ్వు నవ్వినాను కాని ఆ చిరునవ్వు

కాంతులు సుబ్బమ్మపై ప్రసరించినట్లు కాంతానికి అనుమానం కలిగింది.

—మీరు సరిగా భోజనం చెయ్యడం లేదన్నది కాంతం కషాయిత కంఠంతో.

నేను మాట్లాడలేదు. అప్పుడే సుబ్బి పెదవులు ఎందుకో కదులుతున్నవి. అది చూస్తున్నాను. పెదవులు కదలినవి. ధ్వని బయలుదేరింది.

—మేము వస్తే బావగారికి దిగులు వేసిందేమో" అని పల్లెటూరు హాస్యపు మాట ఒకటి అన్నది.

నేను మాట్లాడక ఆ మాటలు వినటంలో శ్రవణ సౌఖ్యం అనుభవించాను.

నిజంగా నేను ఆ రోజు ఏమి భోజనం చెయ్యలేదు. ఇంతలో సుబ్బమ్మ భోజనం కావటంవల్ల నేను కూడా మజ్జిగతో పూర్తిచేసి లేచినాను. భోజనానంతరం ముగ్గురమూ చాపమీద కూర్చున్నాము. కాంతం తమలపాకులు యీనెల తబుకులో పెట్టుకొని వచ్చి ముందు పెట్టి తాను కూర్చున్నది. మేము ముగ్గురము ఏ మేమో మాట్లాడుకొన్నాము. సుబ్బమ్మ చుట్టి ఇచ్చిన తమలపాకులు నేను పుచ్చుకొన్నాను. కాంతం అక్కడే కూర్చుని తమలపాకులు వేసికొంటున్నది. నేను తనను తమలపాకులు చుట్టి యివ్వమనలేదు. కాంతం మనసు అసూయతో మండిపోతున్నది. ఎందుచేతనో గాని నేను సుబ్బమ్మ వైపు చూచినప్పుడల్లా

మా కాంతం హృదయంలో అగ్నిజ్వాలలు ప్రజ్వరిల్లు తున్నవి. ఇప్పుడు జరిగిన మరొక విషయం ఆ అగ్నిని మరింత ప్రజ్వరిల్ల జేసినది. తమలపాకులు అందించేటప్పుడు సుబ్బమ్మ చిటికెన వ్రేలు నా చేతికి కొంచెం తగిలింది. కాంతం అది కళ్లారా చూచింది. నా ఒళ్ళు పులకరించింది. దేహం చిరుచెమ్మటలు గ్రమ్మినది. సుబ్బమ్మకు పాపం ఆ విషయం తెలియదు. కాంతం హృదయ సీమను, ఈర్ష్యా కోపాలు కారుచిచ్చులాగ కమ్ముకొన్నవి. అక్కడ నుంచి చప్పున లేచి తన గదిలోనికి వెళ్ళిపోయింది.

## 2

గదిలో పరుపుమీద పడి వెక్కి వెక్కి ఏడుస్తున్నది. ఆ హృదయంలో కోపానలము ప్రజ్వరిల్లుతున్నది. వళ్ళు గాలికి రావాకులాగు నిలువునా కంపించిపోతున్నది. ఏమేమో తలపోస్తున్నది. వేడి నిట్టూర్పు సెగల జిమ్ము తున్నది. ఎన్నో భావతరంగములు ఆమె హృదయములో నుప్పొంగుతున్నవి. సుబ్బమ్మతో మాట్లాడినంత మాత్రాన కాంతానికింత విచారమెందుకు? ఆమె తలంపులేమో ఎవరు చెప్పగలరు. ఆమె ఏమేమో తలపోసి ఏడుస్తున్నది. ఇంతలో పకపకమని నవ్వు వినవచ్చినది. కాంతం ఏడ్పుమాని ఆ నవ్వు విన్నది. ఆ నవ్వు దొంతరలు ఒకటి తరువాత నొక టిగా బయలుదేరి మెల్లగా సన్నగిల్లి అంతరించినవి.

అప్పుడు కాంతానికి హృదయం పగిలిపోయేటట్లు దుఃఖం పొంగి పొరలు వచ్చింది. ఒక్కమారుగా సుబ్బమ్మ బుర్ర బద్దలు చేద్దామని బుద్ధి పుట్టినది. కాని తిరిగి ఏడ్వ మొదలు పెట్టినది.

మరి కొంచెం సేపటికి నేను బయటికి వెళ్ళడానికి బయలుదేరి కాంతం గదిలోకి వచ్చాను. కాంతం యీ లోకంలో లేదు. దుఃఖసముద్రంలో మునిగి ఉన్నది. నా వైపు చూడలేదు. నేను ఆమె దరిని గూర్చొని గడ్డం పట్టుకొని కాంతం ఎందుకే కోపం? అన్నాను. నా రెండు చేతులను కాంతం విదిలించి వేసింది. ఇంకా నయం! కృష్ణుణ్ని సత్యభామ చేసినట్లు, ఎడమ కాలితో తన్నిందిగాదని నేను మనస్సుకు సమాధానం చెప్పుకొని తిరిగి ఓదార్చటానికి ప్రయత్నం జేశాను.

—అయ్యో పిచ్చిదానా ఎందుకే విచారం,

—ఎందుకా నా కర్మానికి, నేను చక్కనిదానను కానని.

—కాకపోతే ఇప్పుడు ఏమి. నీకు లోపం?

—ఏమీలేదు ఎవరైనా చక్కని వాళ్ళువస్తే నన్ను జూడరు.

—అయ్యో వెఱ్ఱిదానా ఇదా నీ గొడవ. సుబ్బమ్మ వైపు చూచాననా! చూచినంత మాత్రాన తప్పేమిటి.

—తప్పేమిటి చూచినా తప్పులేదు. తమలపాకులు చుట్టించి పుచ్చుకొన్నా తప్పులేదు. మరి అని ఏమో చెప్పబోయి ఏడ్చింది కాంతం.

—సరేలే. కాంతం ఊరుకో. నీ విచారంలో నాకేమీ అర్థం కనపడదు. సుబ్బమ్మ సౌందర్యవతి. దానిని నేను చూచాను. అది తప్పా! ఎవరివంకా చూడనే కూడదూ! రోజూ ఎన్ని సౌందర్యమయములైన వస్తువులను చూస్తున్నాము. ఎన్నిటి సౌందర్యాన్ని అనుభవిస్తున్నాము. అందులో తప్పేమి? గులాబి పూవును జూచి ఆనందించటం లేదా? దానిని వాసన జూడటం లేదా. గులాబి పువ్వును జూస్తే ఎటువంటి ఆనందమో సుబ్బమ్మను జూచినా నాకట్టి ఆనందం కలిగింది. ఇందులో నా దోషం లేదు. నాకేమీ పాపచింత లేదు. అని ఏమేమో లెక్చెరు ఇచ్చినాను.

—కాంతం విని ఊరుకోని మీరు చెప్పిన విషయం ఆడవాళ్ళకు కూడానా. ఒక స్త్రీ మఱొక పురుషుని సౌందర్యాన్ని మెచ్చి అతనితో సరసాలాడవచ్చునా!

ఆహా! అందులో ఏమీ తప్పులేదు. మాట్లాడినంత మాత్రాన లోపము లేదు ప్రకృతిలో సౌందర్యముగల ఏ వస్తువునైనా సౌందర్యము కొఱకే ప్రేమింపవచ్చును.

—సరే లెండి అన్నది కాంతం. నేను షికారు వెళ్లాను.

## 3

కాంతం మరునాటి నుంచి యథాప్రకారం గృహ కృత్యములు నిర్వర్తించు కొంటున్నది. ఆడవాళ్ళకు కోపం బోగొట్టే మార్గంలో ఒకటి ఏమైనా కొని యివ్వటం క్రొత్త

చీర ఒకటి కొనీయదలచి నేను బజారుకు వెళ్ళినాను. షాపు లలో తిరిగి బేరం చేసి మంచి అందమైన ఊదా చీర ఒకటి బేరంచేసి కొన్నాను. ఆ చీర చాలా బాగుంటుంది. ఎప్పుడు కాంతానికి ఆ చీర చూపుదామా అని ఆతురపడుతూ వేగి రం నడచినాను. దారిలో ఒక ముసలమ్మ ఒక యువతీ వస్తు న్నారు. ఆ చీర చూచి ఆ యువతి, ముసలమ్మతో, ఏమో అన్నది. ముసలమ్మ నన్ను ఆపి "నాయనా ఆ చీర ఎంతకు కొన్నావు" అన్నది. పది రూపాయలు అన్నాను నేను. ఆమె ముఖకమలము ముకుళించినది. నిరుత్సాహంతో కాబోలు- ఆమె నిట్టూర్పు విడిచింది. నేను ఆ చీరను అటు త్రిప్పి ఇటు త్రిప్పి చూస్తూ యింటికి పరుగెత్తినాను. దారిలో మరిఇద్దరు యువతులు ఆ చీర వంక చూచినారు కాని అడగటానికి భయం వేసి ఊరుకొన్నారు. ఇంటికి రావటంతోనే కాంతం వికసించిన హృదయంతో నేను తెచ్చిన బహుమానాన్ని అందుకొని, చాలా బాగుందని తన సంతోషమును వెలిపుచ్చి నది. వెంటనే కట్టుకోమని నేను బలవంత పెట్టాను. వర్జం జూచి భోజనానంతరం కట్టుకొంటానని కాంతం అన్నది. సాయంత్రం జడ వేసుకొని మల్లెపూలు పెట్టుకొని చీర ధరిం చింది. నా పాదములకు నమస్కారము జేసినది. నేను కాంతం ముఖమును పైకెత్తి ముద్దెట్టుకొన్నాను. ఆ ప్రణయ కలహం ఈ సంధితో ముగిసింది.

# 4

ఆ చీర కాంతానికి మక్కువ ఎక్కువ అయింది. ఎల్లప్పుడూ ఆ చీరనే కట్టుకొనేది. పగల్లల్ల పనిలో ఏ చీర కట్టుకొన్నా సాయంత్రం కావటంతోనే ఆ చీర ధరించేది! నేను కూడా ఆ చీరను జూచి కాంతాన్ని గుర్తించే వాడిని.

ఒక రోజున కాంతం సోదరి వచ్చింది. కాంతం అక్కకు కాంతానికి అట్టే వయస్సులో వ్యత్యాసము లేదు. కొంచెం హెచ్చు తగ్గుగా ఒక్కరూపునే ఉంటారు. దూరాన్నించి చూస్తే పోల్చుకొనటం కష్టం.

ఆ రోజున క్లబ్‌లో సభ జరగటం చేత నేను ఆలశ్యంగా యింటికి వచ్చాను. రోజూ వీధితలుపు తెరచి ఉండేది. కాంతం గడపలోనే లాంతరు పెట్టుకొని కూర్చునేవాడుక. ఈ రోజున తలుపు వేసి ఉంది. లోపలయేమైనా పనిలో ఉండవచ్చునని తలుపు నెట్టబోవు సమయమున లోపటి నుంచి నవ్వు వినవచ్చింది. అది యేమియో కనుగొనవలెనని నేను మెల్లగా దొడ్డివైపు వెళ్లాను. నా పడకగది కిటికీ తలుపు తెరచి ఉన్నది. లోని దీపం మాంద్యముగా వెలుగుతున్నది. కాంతం ఊదా చీర గట్టుకొని గోడనానుకొని ఉన్నది. గది వాకిట కాంతానికి ఎదురుగా పురుష విగ్రహము కానవచ్చినది. అతను గడపపై నిల్చుండి కాంతంతో ఏమో మాట్లాడుతున్నాడు. కాంతం నవ్వుతూ తల వూపింది. ఇంతలో అ పురుష వ్యక్తి కాంతం చెయ్యి

పట్టుకొని చిటికెన వ్రేలినున్న ఉంగరమును పరీక్షించింది.

"కాంతం! తలుపు తలుపు" అని అరచాను. ఊదా చీర గట్టుకొన్న కాంతం వచ్చి తలుపుతీసి వెంటనే పెరటి లోనికి పరుగెత్తినది. ఆమె దొంగతనము చేస్తుండగా పట్టుబడిన దొంగవలె మొగ మావలకు తిప్పి పరుగెత్తినదని నేను అనుకొన్నాను. కాంతం వైఖరి చూస్తే తప్పుచేసిన మనిషిలాగ కనిపిస్తుంది రోజూ నవ్వుతూ వచ్చి ఏమేమో మాట్లాడేది. ఈ రోజు నావద్దకు రాలేదు. నాతో మాట్లాడ లేదు. అంతరాత్మ బాధ పెట్టక తప్పదు అనుకున్నాను. కాంతంను యిప్పుడు మాట్లాడించినా లాభము లేదని ఆ వచ్చిన పురుషుడెవడో కనుగొనవలెనని వదినగారిని పిలిచి నను వదినగారు దొడ్లోనుంచి "వస్తున్నా వెంకట్రావు! మడి గట్టు కొంటున్నా" అన్నది.

—కాంతం ఏది?

—దొడ్లో ఉన్నది.

నాకు హృదయములో కోపాగ్ని ప్రజ్వరిల్లుతున్నది. ఎవరో ఒకరు కాంతం చెయ్యిపట్టుకొని వ్రేలినున్న ఉంగర మును పరీక్షించినారు. ఆ మాట తెలుచుకొన్నప్పుడెల్ల ఒళ్ళు మండిపోయినది. ఇద్దర్నీ కొడదామని బుద్ధిపుట్టి ఒళ్ళు తెలి యని కోపంతో గదిలోనికి తూలుతూ వెళ్ళినాను. అక్కడ అటు ముఖం పెట్టి కుర్చీలో కూర్చుని ఉన్న పురుషుడిని చూచినాను. అతను ఒక మూల మంచానికి ఆనుకొని కుర్చీ

వేసుకొని కూర్చున్నాడు, ఇతరులు వచ్చినను కనబడకుండ టానికి కాబోలు దోమతెర కొంచెము తనను మరుగుపరచే టట్లు వేసుకొన్నాడు. కాని పైన వేసుకొనిన ట్వీడుకోటు సిల్కు తలగుడ్డ కనబడుతునే ఉన్నవి. పాదములు కనిపించ డం లేదు. నేను లోన ప్రవేశించి

—ఎవరోయి నీవు? అన్నాను.

—మాట్లాడ లేదు.

—ఎవరునీవు మాట్లాడవేమి?

—జవాబు లేదు.

నాకు దేహం కంపించిపోతున్నది.

నా గదిలో శేరి మాట్లాడవేమి రాస్కెల్ అని చెయి విసరినాను. కాని అది గురితప్పి మంచం స్తంభమునకు తగులుటచే తీవ్రమైన కోపం గలిగి నిమిష మాత్రంలో తూలి అతనిపై బడుతూ లాగి మళ్ళాకొట్టాను. ఆ దెబ్బ ఆ పురుషుని తల గుడ్డపై తగిలి తలగుడ్డ ఊడి వ్రేలాడింది. అప్పుడు నేను నిర్ఘాంతపోయినాను. నా కిప్పుడు మెళకువ వచ్చినట్లయింది. నేను దేనిమీద తూలానో ఆ మూర్తి స్త్రీ విగ్రహం కాని పురుషవిగ్రహం కాదు. తలపైన నాగరం వుంది. ఆవిడ జారు జడ వేసుకొన్నది. మొగమున చిరుచెమ్మటలు గ్రమ్మినవి. వెంటనే ఆమె కోటువిడిచి పారవైచి పొంగిపొంగివస్తూన్న నవ్వును ఆపుకొనడానికి నోటిమీద చెయి పెట్టుకొని పెరటి లోనికి పరుగెత్తినది.

పెరట్లో వదినగారు "కాంతం కాంతం ఆగవే! ఇంకా ఎక్కడికి పరుగెత్తుతావు? అయ్యో ఇల్లాకూర్చో." అని మంచం మీద కూర్చోబెట్టి- ఏమిటే- అన్నది-

—ఏముంది మనం అనుకొన్నట్లు- అని నవ్వింది కాంతం.

—అబ్బ! నవ్వు ఆపుకొని చెపుదూ!

—అక్కయ్యాయి. వారు నన్ను కొట్టబోయి అని చెప్పలేక పక్కలు పట్టుకొని కాంతం నవ్వుతున్నది.

—కొట్టబోయి ఆ- చెపుదూ—

—తాన స్థంభానికి కొట్టుకొన్నారు, అని విరగబడి నవ్వింది.

పడక గదిలో నేను నిర్ఘాంతపోయి కూర్చొన్నాను. నాకు ఈ నవ్వు మాత్రం వినవచ్చింది. ఆ నవ్వు అలలు అలలుగా బయలుదేరి గాలిలో కొట్టుకొని పోతున్నది. నేను చిరునవ్వు నవ్వినాను.

"మీ ఆయన్ని భోజనానికి పిలవ్వే" అన్నది కాంతం సోదరి.

—నేను పోలేనమ్మ నీవుపో.

నాకు మాట రావడంలేదు. నువ్వేపో! నేను నవ్వు ఆపుకోలేను. నవ్వుతే బాగుండదు. నేనుపోను అన్నది కాంతం.

కాంతం సోదరి తప్పనిసరిగా వచ్చి భోజనానికి పిలిచింది. భోజనానంతరం తమలపాకులు చుట్టి పరుపుపైన పెట్టి కాంతం విరగబడి నవ్వుతున్నది.

సరేగానీ నువ్వు మొగవేషం వేసుకుంటే నీ చీరకట్టు కొన్నది మీ అక్కయ్యా! అని నేను అడిగినాను.

అవును అని కాంతం హేళనచూపుతో నా వైపు చూస్తూ.

మీ కంత కోపం ఎందుకు! పర పురుషునితో మాట్లాడితే కోపం లేదుగా! అన్నది.

సరేలే ఊరుకో! ఎవరికైనా వాళ్ళు తెలియదు. ఆ సమయంలో?

ఇప్పుడైన బోధపడ్డదా?

ఆ దెబ్బ తగిలిందా?

దెబ్బ తగిలితే ఎటుగరూ. ఈ తమలపాకుల ప్రాప్తి లేకపోయేదే. మీకే యీ దెబ్బ ......అని తన విజయాన్ని సూచిస్తూ ఓరగన్నులతో నవ్వింది. మిగలబండిన తమల పాకులవంటి కాంతం చెక్కిళ్ళు కెంపెక్కడము చూస్తూ అదే పనిగా తమలపాకు మడుపులు నోటితో అందుకొని నమలుతున్నాను. మడుపులు అందిస్తూ వున్న చేతిని విదిలించి అబ్బా! అన్నది కాంతం–

# మా కాంతం

కాంతం నా మీద విరోధం కట్టింది. పెద్ద యుద్ధం జరిగింది. ఆమె ఆఖరుకు అశ్రుధారాస్త్రము ప్రయోగించింది.

అంతవఱకు ఎందుకొచ్చిందంటారు! అసలు, నేను మీకు మూడు ముక్కలలో చెప్పేస్తాను. కాంతం నన్నే పట్టి తెలివితక్కువ నాగన్న క్రింద కట్టేస్తుంది. ఏదో నేను బి. ఏ, దాకా చదువుకొన్నానా! కొద్దో గొప్పో తెలుగు వాఙ్మయంలో కూడా నాకు పరిచయం ఉందా. కవిత్వం చెప్పలేపోయినా పద్యం అర్థం చేసుకోగలను గదా మరి నన్ను బట్టుకొని పట్టి తెలివితక్కువ పుల్లాయి క్రింద జూస్తే వళ్ళు మండదూ. నా వళ్ళుమండి నేను నాలుగూ అనేశాను.

ఈ విషయంలోనే కాదు ప్రతి విషయంలో నన్ను గూర్చి సగౌరవంగా ప్రవర్తించదు. నేను బజారుకు వెళ్ళితే సరిగా బేరం చెయ్యందే ఏ వస్తువును తీసికోనిరాను. అయితే ఒక డబ్బు ఎక్కువయినా మంచి సరుకు తెస్తాను. రెండు మూడు కొట్లు చూచి అక్కడ కొనేవాళ్ళని విచారించి ధర తెలిసికొని మరీ కొంటాను. అటువంటి సమయంలో ఎంత మంచి వంకాయలు తెచ్చినా ఇంటికి రావడంతోనే ఎబ్బే! ఇవ్వేమి వంకాయలు. గట్టిగా రాళ్ళలాగ ఉన్నవి. కస రెక్కినవి. ఎవ్వరో మీకు టోపీ వేశారు. సీతమ్మ కొన్నది వంకాయలు! ఎల్లావున్నవి అనుకొన్నారు? లేత మొవ్వలు.

కూర వండితే వెన్నలాగ ఉంటుంది. మీరు ఏం తెచ్చినా అంతే అంటుంది. అని అంతతో ఊరుకోక ఎంతకు కొన్నారు అంటుంది. నేను అబద్ధం ఏమని చెప్పేది. అర్ధపావలాకు కొన్నాను సవాశేరు అని చేప్పేస్తాను. అప్పటికి ఒక అర్ధనా తగ్గించే చెప్తాను. వెంటనే అయ్యో! అయ్యో! అర్ధపావలే? సీతమ్మ అణాన్నరకే కొన్నది. ఇంటికొచ్చి అణాన్నరకు యిచ్చి వెళ్ళుతుంటే మీరు బేడా పెట్టుకొని పైగా అర్ధణా కూలి కూడా ఇచ్చారు. ఇంకేమి సంసారం ఇంకేమి పొదుపు" అని సాధింపు మొదలుపెడుతుంది—

అటువంటి సమయంలో నాకు అరకాలిమంట నెత్తి కొస్తుంది. జగన్నాథం కూడా యిల్లాగే కొన్నాడే. పైగా యిద్దరు ముగ్గురు కొంటుండగా చూచాము. అంటె "ఇద్దరు ముగ్గురు కొనాల్సిందే. జగన్నాథం ఉండనే ఉన్నాడు మీకు తోడు డబ్బు తగలెయ్యటానికి అంటుంది. "దానితో వళ్ళు మండుతుంది. నేను చేసిందంతా తెలివితక్కువ బేరం కావాలి! జగన్నాథం తెలివితక్కువవాడే! తాను ఒక్కతే మేధావి కాబోలు! పైన అంతా నన్ను గౌరవిస్తారు. ఇంట్లో నన్ను జూస్తే ఇంత అగౌరవం. అందుచేత వళ్ళుమండి నాలుగు మాటలూ అన్నాను. అది పోట్లాటకు కారణం.

ఇప్పుడే కాదు. ఇదివరలోను ఇల్లాగే జరిగింది. నెల ఆఖరకు జీతం వచ్చింది. ఆ రోజు కాంతానికి మంచిచీర కొనిపెడదామని బుద్ధిపుట్టింది. చాలా సరదాగా బజారుకు

వెళ్ళి చీరలు బేరం చేశాను. కొర్నాటి చీరలు పునహా చీరలు కొనలేక సంసార పక్షంలో పట్టంచుచీర ఒకటి పన్నెండు రూపాయలకు కొన్నాను. ఆ చీర నాకెంతో బాగున్నది. ముచ్చటపడి కొన్నాను. ఎప్పుడు తీసికొని వెళ్ళి కాంతానికి చూపుదామా అని ఆదుర్దా ఎక్కువయింది. ఎప్పుడు జీతం వచ్చినా ఏదో ఒక రెవికగుడ్డో పకోడీల పొట్లామో కాంతానికి తీసికొని వెళ్లే అలవాటు. ఆ రోజు పన్నెండు రూపాయలు చీర కట్టుకొంటె ఎంత సంతోషి స్తుందో, నాకేమి బహుమానమిస్తుందో అనుకుంటూ ఆ చీర కట్టుకొంటె కాంతం ఎల్లా వుంటుందో అని గుటకలేస్తూ ఇంటికి వచ్చాను. గడపలోనే కాంతం కనిపించింది.

కాంతం ఇవ్వాళ నీకో మంచి బహుమానం తెచ్చాను. ఏమిస్తావు.

—ఏమిటి చెప్పండి.

—ఏమిస్తావు చెప్పు.

—ఏమిటి చెప్పేది ఇంట్లో ఉండనిస్తా. చూపించండి వెనక దాచుకొంటారేమి. అయినా మీకిచ్చేదేమిటి. మా కిచ్చే బహుమానం తెలియదా పకోడీ పొట్లామేగా?

—అదిగాదు గొప్ప బహుమానం తెచ్చాను. ఏమి స్తావో చెపితేనేగాని చూపను.

—చూపరు మీరు చూపకుండా నేనే చెప్పేస్తాను.

కాంతం చెప్పేస్తానన్నది. ఎల్లా చెప్పేస్తుంది చెపుమా! ఎవరైనా స్కూలు కుర్రాడు చెప్పేశాడా అని అను మానం కలిగింది. అల్లా జరుగుతుంటుంది లెండి! స్కూలు

కుర్రాళ్ళు కొంతమంది మా యింటి ప్రక్కనే వున్నారు. స్కూలులో జరిగిన ప్రతి విషయం యింట్లో ఇట్టే ఊదేస్తారు.

ఇంటికి రావటంతోనే కాంతం "ఏమండోయి యివ్వాళ పంతులుగారిని రాముడు ఎదిరించాడటె" (అసలు ఏడిపించాడని కుర్రాళ్ళు చెప్పి ఉంటారు) అని ఇవ్వాళ పంతులుగారికి పరాభవం కలిగిందటె అని అంటుంది.

—నీ మొఖం కాదూ! నాకేమి పరాభవము! అని నేను.

—నా దగ్గర దాచబోకండి మీకు జరిగిన పరాభవం నాకు తెలుసును. "ఆర్యుల ఆహారం ఏమిటిరా" అని మీరు అడిగారట. వాళ్లు పండ్లు కాయలు అని అన్నారట. ఇంకేమి తినేవాళ్ళు వాళ్ళు అని అన్నారట. అప్పుడు మీరు మీ అలవాటు ప్రకారం గోళ్లు కొరుక్కుంటు ఉంటే ఆ గుంట వెధవ "ఇంకేమి తినేవాళ్ళండి—గోళ్ళు" అని అన్నాడటగా.

నిజమే. ఆ మాట బాగా అన్నాడు. ఇంత నాగరికత బలిసిన కాలంలో చదువుకొని బి. ఏ. బి. ఎలు. ప్యాసు అయిన వాళ్ళే గోళ్లు తింటుంటే ఎప్పుడో ఇక్ష్వాకులకు పూర్వకాలంలో ఉన్న మనుష్యులు గోళ్ళు తిన్నారనటంలో విపరీతం ఏముంది? మీసాలుకూడా చీకే వాళ్ళంటె మరీ బాగుండేది అని ఎత్తి పొడుస్తుంది. ఇటువంటివి చాలా ఉన్నవి. ఇంతకు ఇప్పుడు చెప్పదలచుకొన్న దేమిటంటే సరే ఆ రోజు నేను తెచ్చింది చూపించనంటె చూపించనన్నాను. ఎట్లా చెబుతుందో చూద్దామని అనుకొని ఎవరైనా కుర్ర

వాడు చెప్పేశాడా ఏం రా బాబు? దారిలో ఎవరెవరు కనిపించారు చెప్మా అని కొంచెం పరధ్యానంగా ఆలో చిస్తుంటె గబగబవచ్చి చీరను లాక్కొని చీరా! మీరు కొన్నది అని అన్నది. చీర అటు ఇటు పరాకాయించి చూచింది. ఊరుకొన్నది.

నా వళ్ళు చల్లబడ్డది. నేననుకొన్న సంతోష మేది. నేననుకొన్న సరదా అంతా సమసిపోయినది. అటు తరు వాత ఏమన్నదో తెలుసునా? సిగ్గుచేటు మొదట ఊరు కొన్నది నేను- చీర బాగున్నదా అని అడిగాను.

"బాగుండ కేమి లెండి బాగున్నది. ఏమన్నా అంటే కోపమూయను. మొన్న సుబ్బమ్మ కొన్నచీర చూచారా? పండటి చీర పదిరూపాయలకు కొన్నది. ఆ చీర చూడండి ఈ చీర చూడండి. ఈ చీర తెల తెల బోతున్నది. చేసే వన్నీ ఇటువంటి బేరాలు. ఏమన్నా అంటె కోపమూయె అని అన్నది. ఇంకేముంది కొండవిరిగి మీదపడినట్లయింది. గంపెడంత ఆశతో ఎంతో ప్రేమతో తెచ్చిన చీరవలన ఇన్నిమాటలా పైగా ముఖం చిట్లించుకొంది. ఇది మా కల హాలకు కారణం.

సంసారం కొంచెం కష్టదశలో ఉండటంవల్ల కిరస నాయిలు డబ్బా తెచ్చుకోలేక సీసాతోనే తెచ్చుకొంటు న్నాము నెల రోజులనుంచి. ఒక రోజున సీసాపట్టుకెళ్ళి కిరస నాయిలు తెచ్చాను. ఆమె వచ్చిచూచి ఇదేమి కిరసనాయిలు వెధవ కిరసనాయిలు. ఎట్టినూనె తెచ్చారేం. అయ్యయ్యో

అని గొణుక్కొంది. ఎంతకు కొన్నారంటె బేడా అర్ధణా అని చెప్పాను అయ్యో పదికాసులే? ఒక అణా దండగ పెట్టారు. ప్రతిదానిలో ఇల్లా పాడుజేస్తుంటె ఏమి సంసారం చేసేది నా మొఖం. ప్రతివాడికీ అదేం పొయ్యేకాలమో కాని మీా మొఖం జూస్తే ధర ఎక్కువ చెబుతారు. అని గట్టిగా అనేసింది. నోరుమూసికొని ఊరుకొన్నాను. ఏమి జేసేది. ఇలా కొంతకాలం జరిగింది. మా ఇంట్లో రాచిప్ప ఒకటుండేది. అది పగిలిపోయింది. అందువలన కొత్త రాచిప్ప కావాలని అన్నాను. ఈసారి నీవే తీసుకురా అన్నాను. బజారుకుపోయి రాచిప్ప, కిరసనాయిలు నిప్పు పెట్టెలు కూడ తెమ్మని చెప్పాను.

బయలుదేరటానికి ఎంతో హడావిడి చేసింది. నేను కూడా వస్తాను. అన్నాం దొరల వలెమనమూ- చరచర మనకొంటూ- పరచకెడదాము రావే:- అని పాటపాడాను. కాంతానికి ఎక్కడలేని సిగ్గు వచ్చింది, నన్ను రావద్దన్నది. నేను వస్తానన్నాను. నేనువస్తే తానుబజారుకు పోవటం మానుకొంటానన్నది. సరే ఏం జేసేది? పోనీలెమ్మని ఊరుకొన్నాను. బజారుకు పోవాలంటె మనము ఏదోపైన ఉత్తరీయం వేసుకొని బయలుదేరుతాము. కాంతం బజారుకు వెళ్ళేటందుకు బ్రహ్మ ప్రయత్నం చేసింది. తలదువ్వి పూలుపెట్టుకొంది. ఊదా చీర కట్టి బయలుదేరింది. చివరికెల్లాగో బావమరిది పదిఏండ్ల గుంట వెధవ ఆమెకు తోడు. జట్కాబండి కట్టించుకొని పొమ్మన్నాను. ఎందుకు అదో దండగ అని కాలి నడక మీాదనే బయలుదేరింది. నేను బడిలోకి వెళ్ళిపోయినాను.

బజారులో జరిగిన విషయం అంతా తరువాత మా బావమరిది చెప్పాడు. రాచిప్ప దుకాణం దగ్గర ఒక ఘంట సేపు బేరం చేసిందట—ఆ రాచిప్ప కాదని ఈ రాచిప్ప ఇది కాదని అది తెప్పించి వాడి దుంప తెంపి—ఆఖరుకు ఒకటి కొన్నది.

ఇక కిరసనాయిలు కొంటానికి బయలుదేరింది. ఇక్కడే వచ్చిన ఉపద్రవం. నేను సీసా బేడా అర్ధనాకు తెచ్చాను. తాను సీతమ్మ కొన్న ధర ప్రకారం అణాన్నరకు పోయించుకు రావలె. ఏ కొట్లో అడిగినా బేడా అర్ధనా మూడు అణాలు చెప్పటం ప్రారంభించినారు. అప్పుడు ఏమనుకొంది 'బేడా అర్ధనాకు పోయించుకు వెళ్ళితినా నా గొప్ప ఏముంది. ఇది వరకు ఆయనను విసుక్కొన్నందుకు నాకు మళ్ళీ వడ్డీతో కూడా చివాట్లు తిగిలిస్తారు అనుకొని ఎల్లాగయినా తక్కువకు పోయించుకుపోవలెనని పట్టుపట్టింది. పట్టుపడితే—యమపట్టు. నాలుగు బజార్లు తిరిగింది. అదేమి అన్యాయమో కాని ఎక్కడా ససేమిరా తక్కువకు పోయమన్నారు. "ఆ! అప్పుడే అనుకొన్నా. ఆ సుబ్బమ్మ ముండ ఎదురుగా వచ్చింది. అది వస్తే ఏం పని జేయబోయినా ఆ పనిపాడే" అని సుబ్బమ్మను తిట్టి ముఖానా చెమటబొట్లు గోట చిమ్ముకుంటూ ధైర్యంతో మళ్ళీ బయలుదేరింది, ఎంతో తిరిగింది. కాని కార్యం లేక పోయింది. బజారు ధరలు ఇంతే కాబోలు పాపం ఆయన విషయమై అన్యాయంగా విసుక్కొనేదాన్ని అని కొంతసేపు విచారించి మళ్ళీ ఎక్కడనైనా పోయకపోతారా బేరంచేస్తే అని చిల్లర దుకాణాలమీదికి పోయింది.

ఏమోయి తెల్లనూనె ఎల్లా పోస్తావు. సీసా?

పదికాసులండీ.

మేము బేరం చేసే వచ్చాము. అక్కడ బేడాకు పోస్తామనే అన్నారు. అణాన్నరకు పోయమన్నాను. ఆ కాడికి పోస్తావా?

—ఎబ్బె! మీతోడండి! బజారు ధర అంతేనండి. మీ బోటి గొప్ప వారు రాజులే బేరం చేస్తే మేము ఎల్లా బ్రతకా లండీ అన్నాడు.

—కాదు మా యింటి ప్రక్కన కామమ్మ పోయించు కొంది ఆ కాడికి పోస్తావా?

—గిట్టదండి

సరేలే పోనీ అని వెళ్ళిపోయింది. నాలుగు గంటలైనా కూడా ఎండాకాలం కావటం చేత వేడి ఎక్కువగానే ఉంది. కాంతం ముఖం వాడిపోయింది. చెమట ముత్యాల లాగా ముఖమంతా ఏర్పడ్డది. పాపం యింకా తిరగటం మొదలెట్టింది. ఒక మూల ఒక అరవవాడు ఒక డబ్బా నూనె పెట్టుకొని మారుబేరానికి అమ్ముకొంటున్నాడు. వాడి దగ్గరకు కాంతం వెళ్ళి,

ఎల్లాపోస్తావోయి తెల్లనూనె?

"రొంబ నల్లనూనె ఉంది అమ్మా రెండు అణాన్నరా సీసా"

"నల్లనూనె ఏమిటి నా కొద్దు అది. తెల్లనూనె ఉన్నదా. బేరం చెయకుమరి అణాన్నరకు పొయ్యి"

బజారులో అంతా ధరయిదె. అమ్మ మంచి నూనె

పోస్తాను. నల్లనూనె అంటె రొంబ మంచీదిదా ఉంది.

అణాన్నరకు పోస్తావు?

బేడా అర్ధనా తక్కువరాదు.

సరే పోసీలే అని కాంతం బయలుదేరింది. కొంచెం మారం పోయిన తరువాత పిలిచి,

"అమ్మా, అమ్మణీ రాలమ్మ అట్లా పూడుస్తావేమి. ఏదో ఒక వెలకు పోయించుకోమా"

"పూడవటం ఏమిటి నీ బుగ్గి- అణాన్నరకు నీసా పొయ్యి"

"ఒకటీ ముక్కాలు అణా-ఏమమ్మా ఏమంటావు"

"అణాన్నరే"

సరిద! నీవు చూస్తే రొంబ గట్టి మనిషిదా కన్పడతావు. తే. అమ్మ నీసా-ఇది రహస్యంగా ఉంచు- ఏమో పావుకారుకు తెలియకుండా తెచ్చిన సొమ్ము ఇది. మీ అంటి వారికి అమ్మి బ్రతుకుతాను. ఎంతవస్తే అంతేకదా.

సరే పొయ్యి అన్నది కాంతం! డబ్బాలోనుంచి వాడు తెల్లటినూనె పోస్తుంటే కాంతం ముఖం వికసించింది. పుష్పం లాంటి నూనె తక్కువ ధరలో వచ్చింది. దొంగ సొమ్మో దొర సొమ్మో. నిప్పుపెట్టెలు కూడా అక్కడే చౌకగా పావలాకు కొని ఇంటిదారి పట్టింది. నేను డజను ఆరు అణాలకు రోజు కొంటె తాను తక్కువ ధరకే కొని తెచ్చింది.

అప్పటికప్పుడే సాయంత్రము పడింది. చీకటి మెల్లగా

కమ్ముకొస్తున్నది. నేను స్కూలునుంచి వచ్చి పడక కుర్చీలో కూర్చొని పక్కనే బెంచిమీద కూర్చున్న బడిపిల్లలతో మాట్లాడుతున్నాను. కాంతం ఇంకా ఇంటికి రాలేదేమని కొంచెం భయం వేసింది. ఇద్దరు కుర్రవాళ్ళను "బజారు వైపుకు పొండిరా" అని పంపాను. నేను మటుకు సాహితి పత్రిక చదువుకొంటూ పడుకొన్నాను.

"దారిలో వెధవముండ వాళ్ళు ఉంటారు. రెండు దెబ్బలేస్తే ఏమిటి దిక్కు. అదీ కుర్రవాడు వెళ్ళారాయ" నని అనుకొంటూ ఉండగానే వీధిలో కాంతం గొంతు విని పించింది. పిల్లలూ ఆమె యింట్లోకి వచ్చారు. ఆమె ముఖం పుష్పము లాగా వికసించి ఉన్నది. చిన్న చిన్న గంతులు వేసుకొంటూ యింట్లోకి వెళ్ళింది. ఆమె నడకలు ఆ ముసి ముసి నవ్వులు విజయభేరిని నా హృదయంలో ఢాం ఢాం అని కొట్టినవి. నా గుండె జారిపోయింది. సంగతీ సందర్భాలు బోధపడ్డవి. నా తెలివి తక్కువ నేటితో లోకానికి టాం టాం అవుతుంది. కాంతం ప్రత్యక్షంగా "ఇదిగో కిరస నాయలు అణాన్నరకీ కొన్నాను. మీరు ఈ నూనెనే బేడార్ధ నాకు కొన్నారు. అని చూపించి ఢంకా మీద దెబ్బకొట్టి నట్లు నా బుద్ధిమాంద్యాన్ని ప్రపంచానికి తెలియపరుస్తుంది. అదిగాక హైస్కూలు పిల్లలు నా దగ్గర ఉన్నారు. వాళ్ళు ఉన్నారని ఏమైనా జంకుతుందా. ఎవరున్నానరే. భగవంతు డున్నానరే. అనవలసిన మాట అనే తీరుతుంది. నదురూ బెదురూ లేదు. పరాజయం పొందటానికి సిద్ధపడి కూర్చున్నా. ఏం చేసేది?

లోపల వస్తువులు పెట్టి చూచారా మరి. ఏమైన అంటే మీకు కోపం అని ఉపోద్ఘాతం మొదలు పెట్టింది. నేనేమి జవాబు ఇవ్వక పూర్వమే తిరిగి ఉపక్రమించి—మరి ఏమన్నా అంటె కోపమాయె, మీకు సంసారం చక్కగా చేసుకోటం తెలియదు. అని దీర్ఘోపన్యాసానికి పూనుకొన్నది.

నేను తెలియక ఏం జేశాను అన్నాను.

ఏం జేశారని చెప్పేది. ప్రతి వస్తువు కొనడంలోనూ ఒక అణా ఎక్కువ పెడతారాయె. అణాలు పోగొట్టితే రూపాయలు ఎల్లా మిగులుతవి? బేరం చేయటం తెలియదాయె. ఆడదాన్ని నేను వెళ్ళి ఎన్నని బేరం చేసేది. మీరు ఆరు అణాలకు కొన్న రాచిప్ప నేను అయిదణాలన్నరకే కొన్నాను. కిరసనాయిలు ఒక అణా తక్కువకే కొన్నాను. నిప్పుపెట్టెలు చౌకగా కొన్నాను. ఈ మూడు వస్తువులలో ఎంత లాభం కలిగిందో చూడండి. మీరు కొంటే ఎంత నష్టం కలిగేదో! మీరు ఇల్లాగే బేరం చేస్తే సంసారం దివాల అవుతుందంటె విపరీత మేమున్నది. అని సరసంగా ఉపన్యాసం ముగించింది.

నేను అట్టేమాటాడక కిరసనాయిలు ఎట్లా ఇచ్చాడబ్బా అని ఆలోచించాను. నిజంగా తెలివితక్కువ బేరం చేశానను కొన్నాను. కాంతం నిజంగా తెలివిగలదని తీర్మానించు కొన్నాను. తెలివిగలది కాకపోతే కిరసనాయిలు నిప్పు పెట్టెలు అంత సరసమైన ధరకు ఎట్లా తెస్తుంది చెప్పండి? ఆఖరుకు నేనన్నాను "సరేలే నాతో వాదము ఏమిటి లోప

లికిపోయి దీపం వెలిగించి భోజనం ఏర్పాటు చెయ్యి అన్నాను.”

“అదెంతలోకి లెండి? మీ బేరానికి చెప్పాను? ఇక నుంచి అయినా జాగ్రత్తగా ఉండండి” అని లోపలికి పోయింది.

కాంతం లోపలికి పోయి చమురు బుడ్డిలోను లాంతరు లోను పోసి వెలిగించుటకు నిప్పుపెట్టె వెలిగిస్తే తుప్ తుప్ మని ఆరిపోయింది. రెండోపుల్ల గీచినా అంతే అయింది. అయిదారు పుల్లలు గీచినది. అన్నీ అంతే అయినవి. కాంతం కొంచెం వివర్ణ అయింది.

“ఏమబ్బా!”

”ఏమబ్బా ఏమిటి? అవి మండవు.”

“మండకేమి? రేపు అవే మండుతవి. ఇవ్వాళ తడిసినవి” అన్నది కాంతం.

“నడిఎండాకాలంలో తడవడమేమిటి. అందులో ఇప్పుడే ప్యాకెట్టు విప్పుతుంటివి.”

“మరి ఎందుచేత నంటారు”

“ఎందుచేతనో” అని గట్టిగా నవ్వాను.”

మోసపోయినానా ఏమిటి చెప్మా అని అనుకొంది కాబోలు. పాపం మళ్ళీగీచి చూచింది. మండలేదు. బడిపిల్ల లంతా విరగబడి నవ్వుతున్నారు. నేను వెంటనే ఒక పిల్ల వాణ్ణి నరసమ్మగారింటికి పంపి అగ్గిపెట్టె తెప్పించాను.

లాంతరు తుడిచి వత్తి కత్తిరించి నిప్పుపెట్టె వెలిగిం

చితే అదేమి చిత్రమోకాని వెలగదు. వత్తి పైకిలాగి మళ్ళీ వెలిగించినా అంతే. చమురు ఎక్కటంలేదేమో అని చమురులో ముంచింది వత్తిని. అటుతరువాత వెలిగించినా వెలగలేదు. పిల్లకాయలు విరగబడి నవ్వినారు. ఎన్నిసార్లు చమురులో ముంచి వెలిగించినా వత్తి ససేమిరా వెలగలేదు. పైగా చిటపట లాడుతుంది.

నాకూ అంతకంటె నవ్వొచ్చింది.అంతాకలసినవ్వాము.

కాంతం నన్ను తెలివితక్కువవాణ్ణి అని విసుక్కున్న మాటలన్ని జ్ఞాపకంవచ్చి ఒక్కమారు కసితీర్చుకోవాలెనని

"ఇదుగో కనబడ్డదా తెలివిగల బేరం? మహా మేధావివి తెచ్చావు వస్తువులు చౌకగా! ఇంటిదగ్గర కూర్చొని బజారునుండి చచ్చీచెడీ తెస్తే అది బాగుండలేదు. ఇది బాగుండలేదు. వంకాయలు లేతగాలేవు. చీర పండులాగ ఎట్టిగాలేదు. అనటం అనుకొన్నావా" అన్నాను.

కాంతానికి ఎక్కడలేని అభిమానమూ సిగ్గూ దొంతర్లక్రింద వచ్చినవి. కొంచంసేపయనతరువాత ఏమనుకొందో లేని చిరునవ్వు తెచ్చుకొని నిజంగా మోసం అంది అపజయం సూచించే డగ్గుత్తికతో—

"సందేహ మేమిటి ఎక్కడ కొన్నావు."

"రావిచెట్టుక్రింద అరవవాడి కొట్లో."

"అక్కడే కొన్నావు? వాడు టక్కరుముండావాడు. వాడు చమురులో బూడిద నీళ్ళుకలిపి మోసంచేస్తాడు. మాకు తెలుసు. అందుకని అక్కడికి వెళ్ళము. నిప్పుపెట్టెలు మాయవి. అవిమండవు. ఇంకేం కిరసనాయిలు పారబొయ్యి, అన్నాను. అప్పుడు కుఱ్ఱవాడిని బజారుకు పంపి నూనె తెప్పించి దీపం వెలిగించుకొని వంట వండుకొని భోజనం చేసేసరికి పదకొండు గంటలయింది.

# నేనూ మా కాంతం

నువ్వు వెయ్యి చెప్పు లక్ష చెప్పు నేను ఈరోజు ఇంట్లో భోజనం చెయ్యను, భోజనం ఏమిటి, పచ్చి మంచినీళ్ళు తాగను. కాకపోయినా నీ ఆగడం ఎక్కువై పోయింది. ఎన్నాళ్ళని భరించి ఊరుకొనేది. నాకు ఈరోజు ఇంట్లో భోజనం చెయ్యటానికే మనస్కరించటం లేదు. నేను హోటలుకు పోకమానను.

క్షమించండి - నేనేమన్నాను.



క్షమించటం అన్న మాట నా చెవిని పడకూడదు. ఒంటరిగా ఏకాంతంలో ఎన్ని పరాభవాలన్నా భరిస్తాను గాని పదిమంది స్నేహితులలోనూ నన్ను పరాభవం చేస్తే నేనేమిటి చేసేది అన్నాను. క్రిందటిరాత్రి జరిగిన పరాభవం తల్చుకొని కోపంచేత ఒళ్ళు మండిపోయి ఆరోజు హోటలుకు వెళ్ళాను. అంతకు పూర్వం ఎన్నో పరాభవాలు అనుభవించి పొట్టలో పెట్టుకొని ఊరుకొన్నాను. నేను కోపదారినే అంటారా!

కాంతంతో పోట్లాట ఎందుకు? ఎల్లాగో సర్దుకుపొండి అంటారు. ఎలాగు? భర్తను గౌరవించటం పోయింది సరి గదా పైగా నన్ను వెంకట్రావూ - వెంకట్రావూ అని చులకన చేసి నెమ్మదిగా పిలవటం. వినపడదు అనుకొంటుంది కాబోలు వెఱ్ఱిబాగులది.

పోనీ దానికేమని ఊరుకొన్నాను. నా తలగుడ్డ చూచి పకపక నవ్వటం ఎందుకు? విద్యార్థిగానున్న అవస్థలో తల

పాగ చుట్టిన పాపానపోలేదు. ఉపాధ్యాయ వృత్తిలో ప్రవేశించిన తరువాత తప్పని సరిగా చుడుతున్నాను, అది నాకు కుదరదు. ఒకమాటు చుటితే రోకలికి చుట్టినట్లు అవుతుంది. మరోమారు అరవవాడి తలగుడ్డ కిందికి తేలుతుంది. ఛా! బాగుంది కాదని శ్రద్ధగా చుడితే పాములవాడి పాగా ఆకారం ధరిస్తుంది. గ్రీకు పురాణ కథలలో ఒక గొల్లవాడు ఉన్నాడు. వాడికి భవిష్యత్తు చెప్పే నేర్పు ఉంది. కాని వాడిని పట్టుకొంటే వాడు చెప్పక అనేక భయంకరమైన రూపములను పొంది తన దగ్గరకు వచ్చినవాళ్ళను భయపెట్ట వలెనని చూస్తాడు. ఆ పట్టుకొన్నవాడు భయపడక అల్లాగే పట్టుకొని ఉంటే అప్పుడు తన నిజస్వరూపాన్ని దాల్చి భవిష్యత్తు చెపుతాడు, ఆ గొల్లవాడు నా తలగుడ్డ అవతారం ఎత్తాడేమోనని నాకు అనుమానం. ఏదైనా అవుతుందికాని ఇది నిజస్వరూపం దాల్చి బడిపంతులు తలగుడ్డ మాత్రం కాదు. అట్లా నేను అవస్థపడుతుంటే నాకు సహాయం చేయడం లేకపోగా దొడ్డిగుమ్మంలో నుంచొని విరగబడి నవ్వితే నాకెల్లా ఉంటుంది.

అటువంటి సమయంలో సహించి ఊరుకోటమే సుగుణం కొన్ని కొన్ని సమయాలలో నోరెత్తటానికి వీలు లేదు. ఒకరోజున రాక రాక పరిషత్పత్రిక వచ్చింది. ఎంతో ఆదుర్దాగా చదివి కాంతంకూడా చదవాలె, ఇందులోవిజ్ఞాన విషయాలు చాలా ఉన్నవని, సరదాపడి పరుగు పరుగున ఇంటికివచ్చి వంటచేస్తున్న కాంతంతో "ఇదుగో పరిషత్పత్రిక వచ్చింది. మంచి విషయాలున్నవి

చదువు" అని చేతికి స్తే తీసికొని నే, నటు పోగానే చారు రాచిప్పమీద మూత పెట్టింది! నేను వచ్చిచూచి విచార పడుతుంటే నవ్వుతుంది! అప్పుడు ఏమిటి అనటం! మళ్ళీ మాట్లాడలేదు.

అటువంటి సమయంలో ఏమంటే ఏమి లాభము? ఆ పత్రికయొక్క విలువ దానికేమి తెలుస్తుంది? ఆపళంగా కూర్చోబెట్టి దానికో నీతిపాఠం చెప్పి ఆ పత్రిక దేశానికి ఎంత ఉపకారం చేస్తున్నదో నీకేం తెలుస్తుంది కొద్దిగా చదివి వినిపిస్తాను చూడు, అని మురుగేశం పిళ్ళగారి వ్యాసములోనుంచి,

కంబడీ లూలాయిూలంపు నవ్వడి నెతిగి యూమంకుని బింకంపు బొంకులకు గొంకక నింగెఅగడ్డి—అని చదువుతుంటే "చాలుచాలు ఆపెయ్యండి ఇవి అరవపాటలు నాకు ఇటువంటి మంగళహారతి వచ్చు. నాతో ఇది తెలుగు అని డబాయిస్తారేం"— అని విరగబడి నవ్వింది. అది అరవ మంగళహారతిగాదు తెలుగు అని చెప్పి ఒప్పించటం నా తరంగాక నేనుకూడా నవ్వాలిసి వచ్చింది. ఈ విధంగా ఎన్నిమార్లో నేను ఏదోపని చెయ్యటం కాంతం నవ్వటం సంభవించటం నాకు చాలా కష్టంవేసి ఒక్కమారైనా నామాట నెగ్గించుకొనేటట్లు నడవాలనీ కాంతం జయధ్వజాన్ని పగులగొట్టాలని ఆ విజయ పతకాన్ని ముక్కలు ముక్కలు చేయాలని అనిపించింది. సరే అని సమయం కోసం కాచుకొని ఉన్నాను. ఒకరోజు పరీక్ష పంతులు

వస్తున్నాడని కబురొచ్చింది. తత్సంబంధమైన పనులలోబడి తీవ్రంగా ఆలోచిస్తూ ఉంటే కాంతం వచ్చి.

—ఏమండోయి

—ఊఁ

—మరీ... మాట

—ఊఁ

—ఒకమాట

—అబ్బ! ఏమిటి?

—మరీ—వినరేం;

—అబ్బ! ఏమిటి చాలా పనిమీద ఉన్నాను!

—ఒక్కమాట చెప్తుదురూ

—ఏమిటి? ఇంత అవసరమైన పనిలో ఉంటే మాట్లాడిస్తావు ఏమిటి? ఊఁ—నీ అవసరం?

—మీరట్లా కోపపడితే నేనేం జెప్పేది. బెండకాయ కూర చేయకుండా పులుసు చేసేదా! పులుసు చేసి బెండకాయకూర మానేసేదా? లేక రెండు మానేసి కందిపచ్చడి జీలకర్ర వేసి నూరేదా! అని అడిగింది. అప్పుడు నాకు కోపం కూడా వచ్చింది. పుస్తకాలు అటువైపు తోసివేసి ఆలోచించాను. ఆ సమస్య నాకెటూ తోచలేదు. "బెండకాయ పులుసు మానేస్తే ఏంకూర!" అని "బెండకాయపులుసు రాదు పులుసుమానేస్తే బెండకాయకూరొస్తుంది." అన్నది. కాంతం. అయ్యబాబో నాకు చిక్కుగా ఉంది. దానిని మీ

తమ్ముడు దగ్గరకు వెళ్ళి Simple equation లోకి మార్పించు కొనిరా. అప్పుడు చూద్దాం పో వేగిరం పో అని తరిమేసాను.

ఈపాటి జయానికే నేనెంతో సంతోషిస్తుంటేఆరోజు సాయంత్రమే పరాజయం ప్రాప్తమయింది. అది ఎల్లాగంటే ఆరోజు రాత్రి కాంతం దగ్గుతో బాధపడుతుంటే సొరుగు పెట్టెలోనుంచి దుంపరాష్ట్రికం ముక్క తీసి

—కాంతం దుంపరాష్ట్రికం ముక్క బుగ్గన పెట్టుకో దగ్గు తగ్గుతుంది అన్నాను.

—అబ్బ దుంపరాష్ట్రికం నాకొద్దు.

—ఎందుకొద్దు?

—నాకు సయించదు.

—సయించటం ఏమిటి? సయించకపోవటం ఏమిటి? మందులే! బుగ్గన ఉంచుకో.

—నాకొద్దులంటె,

—ఉంచుకోక తప్పదు. ఎల్లాతగ్గుతుంది దగ్గు? ఈరాత్రి నీకూ నాకూ కూడా నిద్ర ఉండదు.

—ఆఁ నాకొద్దు.

—వెధవ పెంకితనం ఉంచుకో అన్నాను గట్టిగా.

—నేను ఉంచుకోనంటె ఏమిటీ బాధ అన్నది.

—మరి తప్పదు. తీసుకో నాకు కోపంవస్తుంది అని గట్టిగా అన్నాను. మొగాడికి ఆమాత్రం అధికారం అయినా ఉండొద్దూ ఆడదానిమీద! అని కొంచెం కోపంగానే అన్నాను.

కాంతం నాకు కోపం వస్తుందని భయపడ్డదికాబోలు సరే తెండి అన్నది. "ఆ అల్లా దారికి రా. ఎప్పటికి అల్లాంటి పెంకెతనం చెయ్యకేం నాదగ్గర సాగదు జాగ్రత్త అని గర్వంగా అన్నాను. కాంతం దుంపరాష్ట్రికంముక్కను మెదలకుండా తీసికొంది.

కాంతం పెంకెతనం ఈవిధంగా అణచుకొని రావాలె. ఈ విధంగా గర్జించి భయపెడితే భయభక్తులలో ఉంటుంది అని అనిపించింది ఆ క్షణంలోనే. ఇకముందు ప్రతివిషయం లోనూ ఇదేవిధంగా నామాట సాగించుకోవాలెనని తీర్మా నించుకొన్నాను. నామాట సాగుతున్నదని అదేమిటో పిచ్చి సంతోషం వేసిందినాకు. నాలో నేను నవ్వుకొన్నాను.

ప్రొద్దున కోపించడం కొంచెం లాభించిందని అనుకొ న్నాను. భార్యను అల్లా భయభక్తులలో ఉంచాలరానాయనా అని మా తాత అన్నాడు. నాకుకూడా అదేమార్గం అనిపిం చింది; కాంతం పాపం నావంకజూచి ఒక చిరునవ్వు నవ్వింది ఎందుకో?

మంచంమీద నడుమువాల్చాను. కాంతం యింకా దగ్గుతూనే ఉంది. ఎంతసేపటికీ ఏమాత్రం శాంతిలేదు. గంటా రెండు గంటలయింది. ఏమబ్బా ఈపాటికి కొంత శాంతి కలుగుతుందే అని దగ్గరకువెళ్ళి చూద్దునుగదా కాంతం దుంపముక్క ముక్కపళంగా అరచేతిలో పెట్టు కొని బుగ్గకు ఆనించుకుని పడుకొన్నది. "ఇదేమిటి? నీ తెలివి తెల్లవారా! అంటే "మీరు బుగ్గను ఉంచుకోమంటే బుగ్గనే

ఉంచాను. నోట్లో వేసుకోలేదుగా! అని అన్నది ఇంకేమి మాట్లాడేది.

ఇన్నిమార్లు ఈ విధంగా అవమానాలన్నీ నెత్తిని వేసుకొని పైకి చిరునవ్వుతో ఊరుకొన్నాను. అయితే ఆరోజు హోటలులో భోజనానికి వెళ్ళిపోయేటంత కోపం ఎందుకొచ్చిందంటే కారణం ఇది.

నా స్నేహితుడూ నేనూ భోజనం చేస్తున్నాము. కాంతం వడ్డిస్తున్నది. స్నేహితుడు కొంచెం మొగమోటస్తు డగుటచేత నేను కొంచెం బలవంతపెడుతున్నాను. బీద సంసారాలలో ఎక్కడ కూరలుకొని గొప్పగా విందుచేయ గలము! అందుకని ఏదో మనయింట్లోఉన్న గోంగూర పచ్చడితోనే వారికి విందు కల్పించి విస్తరిలో బీదతనం కనబడుతున్నా మాటలలో లేకుండా, బంగాళాదుంపలు ఓడలు రాకపోవడంచేత మంచివి దొరకటంలేదు. కుళ్ళిపో యినవి బజారులో ఉన్నవనీ, మిగతా కాయకూరలు ఏవి తాజావి లేవనీ, ఎన్నాళ్ళక్రిందనో కోసిన పొట్లకాయలు కొని కూరవండించి స్నేహితులకు పెడితే జబ్బుపడతారనే భయంతో ఏదో పథ్యముగానే జరిపి ఆరోగ్యం కాపాడితే గొప్ప మేలుచేసినవాడిని అవుతానని తలంచితినని, ఏవో నాలుగుమాటలు చెపుతున్నా. చేయనివస్తువులను ఆ విధంగా దూషించి చేసిన వస్తువులను కొంచెం పొగడటం మొదలుపెట్టి, వాళ్ళు గోదావరితీరవాసులగుటచేత, గోం గూర సుగుణాలు చెప్పి, కౌన్వేయశాస్త్రంలో కూడా

దానిని నిషేధించినట్లు నిదర్శనాలు లేవని ప్రపంచంలో (గ్లోబులని) ఎందుకనరాదు గ్లోబులో ఎక్కడైనా గోంగూర పండుతుందా?) కల్లా. ప్రసిద్ధిచెందిన గుంటూరు గోంగూరతో ఆ పచ్చడి తయారుచేయబడ్డదనీ, (అది నిజానికి గుంటూరు గోంగూరకాదు.) ఏమేమో తియ్యని మాటలు ప్రేమకొద్దీ నేను నాస్నేహితునకు చెపుతూవుంటే ఈకాంతం —ఆమాట తల్చుకొంటే యిప్పుడు నాకు నవ్వువస్తుంది, అప్పుడు వళ్ళు మండిపోయింది, వంటయింట్లోనుంచి పని వేళవచ్చి సన్నగా—"మనం గుంటూరునుంచి గోంగూర ఎప్పుడు తెప్పించాము!" అన్నది.

అదివరకే నేను బంగాళదుంపలు బజారులోనే లేవని తాజాకూరలు అసలులేవని, చెప్పటం కొంచం కోతలని సందేహిస్తున్న స్నేహితులు ఈ మాటలు విని,—"కోస్తున్నావు నాయనా" అని విరగబడి నవ్వారు. కాంతం వంటయింట్లోకి వెళ్ళింది. అక్కడ నవ్వుతున్నదని నాకు తెలుసు. మా యింట్లోవాళ్ళుకూడా నవ్వుతున్నారు. ఇల్లంతా నాటకంలో విదూషకుని మాటలు విన్నట్లు విరగబడి నవ్వుతున్నారు. నవ్వకుండా ఉన్నది నేనొక్కణ్ణి. ఇక మాబావమరిది విస్తరిముందరినుంచి లేచి, గంతులేస్తున్నాడు సంతోషము పట్టలేక.

నాకు ఉడుకుమోతుతనంవచ్చి కాంతంతో "ఆ ఏమిటి అది? మొన్న మా అక్కయ్య తీసుకొనిరాలేదా?" అన్నాను. కాంతం "అవును మరచిపోయినాను" అన్నది. అయినా ఆమాట ఎవరూ నమ్మేటట్టులేదు. ఆ అనటంలోనే

వ్యతిరేకార్థం స్ఫురించింది కాబోలు ఇల్లంతా నవ్వారు. ఇక లాభంలేదని నేనుకూడా ఒక చిరునవ్వు ఆనవ్వు ప్రవాహంలో పారేశాను. కలిసికొట్టుకుపోయింది అది.

ఇప్పుడింత ఖులాసాగా చెప్పినా ఆరోజు ఒళ్ళు మండిపోయింది. ఇంట్లో నసేమిరా భోజనం చెయ్యనన్నాను. ఆ ఫళంగా హోటలుకు బయలుదేరాను. అప్పటికి పొద్దుటినుంచి కాంతంతో పోట్లాడుతూ కూర్చోటంవల్ల షుమారు పదకొండు గంటలయింది.

కాంతంతో పోట్లాడి బయలుదేరటంచేత చాలా కోపంగాబయలుదేరినాను. అదివరకెప్పుడూ తరచుగా పంటపూటయింట్లోభోజనం చేసినవాణ్ణికాను. అయితే అరవవాడి హోటలు చాలా సౌకర్యంగా ఉంటుందని విన్నాను అందుకని అరవహోటలు ఎక్కడా అని విచారిస్తూ వెళ్ళాను. ఒకచోట బల్లపై —"ఇక్కడ అన్నము వేయబడును" అని వ్రాసిఉంది. అన్నం వేయబడునా? ఏమిటిది? ఇదేమి ప్రయోగం? గొడ్లకు మేతవేస్తాముకాని మనుషులకు మేతవేస్తామా? అని నాలో నేను తర్కించుకొని, నవ్వుకొంటూ లోపలికి పోవాలని తలుపు తట్టాను. లోపల ఎవరో.

ఎవరు యారు? అన్నాడు.

తలుపు తీయవయ్యా.

ఎవరు యారు?

తలుపు తీయవయ్యాగోల.

లోపలనుంచి ఒక మనుష్యరూపమువచ్చి నిలబడ్డది. నల్లటి మురికిబట్ట కట్టుకొన్నాడు. వచ్చి యారు? అన్నాడు.

—ఏబ్బే ! ఏమిలేదు. ఇక్కడ అన్నం పెడతారా?

—ఊఁ వేస్తురు.

—వెయ్యిమరి.

—"టికెట్ కొనుమా" అన్నాడు.

సరేఅని టికెట్ కొన్నాను. విస్తరిముందు కూర్చు న్నాను. వాడు వచ్చి "మెతుకులు వేయనా?" అన్నాడు. నావళ్ళు మండింది. మెతుకులు వేయటం ఏమిటి? వాడి పిండం నేనేమన్నా జబ్బువాడినా?. వీడిదుంప...నాకేమైనా పథ్యం పెడతాడా? అని భయంవేసింది. ఇంతలో వాడు వచ్చి నిజంగా రెండు మెతుకులు విస్తట్లోవేశాడు. ఆ మొదటివాయి నాకు నిజంగా పచ్చడిలోకి సరిపోలేదు మళ్ళీ అన్నం అని కేకేశాను. మళ్ళీ వాడు రెండు మెతుకులు చూపిస్తూ" ఇదంతా వెయ్యనా, అన్నాడు. "అదంతా ఇంకా మూడింతలు వెయ్యవోయి నన్ను చంపక" అన్నాడు. ఎందుకో కోపమువచ్చి నా విస్తట్లో ఆ పళ్ళె ములోఉన్న సాదం అంతా గిరాటువేసి వెళ్ళిపోయినాడు.

నెయ్యి వేయటానికి వచ్చాడు. చేతిలో నేతిగిన్నె ఉంది అదిమటుకు సత్యం—అడుగున నెయ్యి ఉందో లేదో భగవంతుడికి తెలియాలిసిందే. నిజంగా యేమి తెలుస్తుంది? బంగాళాఖాతం అడుగున ఏముందో తెలిసికోటం కష్టంకాదు కాని, ఆ గిన్నె అడుగులో ఏముందో తెలిసికోటం కష్టము. ఏమీలేదు, అని నేను అనలేను. ఎందుచేత నంటే— Full many a gem of the Purest ray serene, the dark unfathomed caves of oceans bear— అన్నాడు. ఆపళంగా

వాడు ఆగిన్నెలోని ఆఖాతంలోకి ఒక పొడుగైన గరిటెను పోనిచ్చి పైకి బహు నేర్పుగా లాగి దానిని అమాంతంగా నానెత్తిమీదుగా ఒక మైలుదూరం పైకెత్తి, గంటెను వంచాడు. ఆపైనుంచి హిమాలయ పర్వతము మీదినుంచి గంగలాగ పడుతుందేమో, అని భ్రమపడ్డానుగాని ఏమి పడ్డదో తెలియదు.

కూరఅన్నం తినకముందే గోకర్ణంతో పులుసుతెచ్చి 'సాంబారు' 'సాంబారు' అని అరిచాడు. నన్ను సరిగా భోజనం చెయ్యనివ్వడురా అనుకొని, ఆలస్యం చేస్తే, మళ్ళీ రాడేమో అని భయంవేసి, ఆకూర అన్నం ఒకపై పుకు నెట్టి, సాంబారుతో అన్నం కలిపాను. అది తిని తరువాత రసంతో రెండుమెతుకులుతిని మజ్జిగతోకూడా కొంచెం తిని, లేచాను. విస్తారం తింటే వాడు ఏమనుకొంటాడో అని భయంవేసింది.

వెళ్ళిపోవాలని చొక్కా వేసుకొని వెళ్ళబోతుంటే— యక్స్ట్రా సార్ అన్నాడు. పెరుగువేసినందుకు నెయ్యివేసి నందుకు ప్రత్యేకంగా చార్జి చేశాడు. మొత్తంమీద పది అణాలయింది. డబ్బు అంతా యిచ్చిన తరువాత వాడు పొగాకు నములుటచేత నల్లబడ్డపళ్ళు బయటపెట్టి పూడు స్తారా; అన్నాడు.

—ఏమిటి?

—పూడుస్తారా!

—ఎవరిని?

...ఏమి సార్? యిప్పుడు పూడుస్తారా?

ఇప్పుడు కాదులే రేపొచ్చి అని సాగాను అదేమిటో పూడవాలని నాకు భయంవేసింది. అదేమి గుంటోగోయ్యో అనుకొన్నాను.

ఈవిధంగా అర్థకూడు తిన్నాను. కాంతంమీద కోపం చేత పూటకూలి యింటికి వచ్చి, తగిన శిక్ష అనుభవించానని అనుకొన్నాను. ఇంటికివెళ్ళాను. కాంతం రోజువలె పడకగదిలో లేదు. వంటయింట్లోకి వెళ్ళాను. అక్కడ పీట మీద చెంగుపరచుకొని పడుకొన్నది. అప్పటికి రెండు అయింది. పాపం అప్పటికి భోజనం చెయ్యక నాకోసం కని పెట్టుకొని కూర్చున్నది. నాకు కాంతాన్ని చూస్తే జాలి వేసింది. పాపం నాకోసం యింతవరకూ మాడుతూఉన్నదే అనిపించింది.

నన్ను చూచి కాంతం లేచింది. విచారపడ్డట్లు ముఖ లక్షణాలు చెబుతున్నవి.

—లే! ఇంకా భోజనం చెయ్యలేదా?

—లేదు. మీరురాందే.

—నేను లేకపోతే నీవు తినకూడదమా.

—నామనస్సొప్పదు.

—సరే ఇప్పుడు తిను

—మీరుతినంది నేనుతినను

—నే నెక్కడైనా తినొస్తే!

—రాత్రిదాకా యిల్లాఉంటాను.

—ఆమాటవిని కాంతానికి నామీద ఎట్టి నిజమైన ప్రేమఉందో గ్రహించాను. అంతకుముందు హోటలులో అర్ధాన్నమే తిన్నాను. కాబట్టి సరేలే, వడ్డించు అన్నాను.

—కాంతాన్ని బలవంతపెట్టి రెండు విస్తళ్ళలో ఒక్కమారే వడ్డనచేయించి, ఇద్దరం ఒక్కసారే కూర్చొని సరదాగా తిన్నాము.

# తేనీటిగిన్నెలో తుపాను

తుపాను వచ్చిన మర్నాడే దీని విషయమై వ్రాయటము సంభవించటంవల్ల ఆవిషయం తలుచుకొన్నప్పుడల్లా నాకు గుండెలు దడదడా కొట్టుకొంటవి. భయంచేత వళ్ళు వణుకుతున్నది. కలం సాగటంలేదు. కాని కథవ్రాసి పంపమని హుకుం ?

గుండెలలో దడ కొంచెము ఆగి ఈ వేడిరక్తము కొంచెం చల్లబడ్డ తరువాత వ్రాస్తే బాగుండును. ఢక్కా వాయించినట్లు రుంజా మోగించినట్లు నాగుండెలు ఢమా ఢమా కొట్టుకొంటున్నవి. కాని ఏంజేసేది ధైర్యం చిక్కబట్టి కలం సాగిస్తాను.

అదుగో అప్పుడే మాకథ చదివే వారిలో కుర్రవాడు వణుకుతున్నాడు భయంచేత.

అవును. మరి భయంకరమైన విషయం చెప్పే సమయంలో భయం వేయటంలో విచిత్ర మేముంది.

దొడ్లో ఏదో చప్పుడవుతోంది. నాగుండెలు ఆగిపోయినాయి. ఎల్లాగ!

అతను అప్పుడే నవ్వుతున్నాడు. గొప్పగొప్ప వీరులు శూరులు పుట్టిన దేశంలో పుట్టి భయంచేత వణుకుతున్నావా అని అతడు నన్ను పరిహాసం చేస్తున్నాడు. ఎవరి

ప్రాణంమీదికి వస్తేనేకాని వారికి తెలియదు. దూరంగా ఉన్నంతసేపు ఎన్నికబురులైనా చెప్పవచ్చు! పెద్దపులి అడివిలో కనిపించిందిరా హడిలిపోయాను అంటే తోసుకుచ్చుకొని నేలకేసి కొట్టలేకపోయావా అన్నాట్ట. గొంతుమీదికి కత్తివస్తేగాని కత్తి కరుకుదనం తెలియదు. ఇంకోడు నా స్థితిలో పిరికితన మేమిటి? ఇంతకంటె అధ్వాన్నంగా ప్రవర్తించేవాడు.

పట్టపగలైతే ఎవరికీ భయంలేదు. అర్థరాత్రివేళ జరిగిన విషయాన్ని జూచి ఎవరు హడిలిపోరు? మేము ముగ్గురం ఇప్పుడు ఒకరినొకరు ఆనుకొని కూర్చొన్నా ఇంకా జంకు వదలలేదు.

అసలు సంగతి చెప్పటానికి నోరు రావటంలేదు. ఎట్లా చెప్పేది. జరిగింది జరిగినట్లు చెప్పేదా! అంటే ఆ విషయంయొక్క మొదలు అందుకొని అక్కడనుంచి చివరకు జరిగిపోవటం ఒక పద్ధతి. ఆ పద్ధతివద్దు. నేను చూచిన విషయం నేను, నాభార్య చూచిన విషయం నాభార్య చెబుతాము. మేమిద్దరము చెప్పే కథలు వినండి: ముందు నేను నాకథ చెబుతాను.

2

అది అమావాస్య. కన్నులు పొడుచుకొన్నా కానరాని చీకటి. దానిపైన ఆకాశం కాలమేఘావృతం అయివుంది. ఆ నిబిడాంధకారంలో ఆ తిమిరలోకైకపతి సిరం

కుశ ప్రభుత్వం చలాయిస్తున్నాడు. కీచుమని చెవులు చిల్లులు పడేటట్లు ఈలకోళ్ళు ఆ తిమిరపతికి ఆహ్వానగీతాలు పాడు తున్నవి. పెందలకడనే భోజనంచేసి ఎవరింట్లో వాళ్ళు నిద్రపోయినారు.

మాయింట్లో మేము పెందలాడే భోజనం చేశాము. నేను నాపసిపిల్లతో కొంచెంసేపు ఆడుకొని తరువాత చదువు కొంటూ కుర్చీలో కూర్చున్నాను. మా కాంతం పొద్దస్తమానం శ్రమపడటంమూలాన నాతరువాత భోజనం చేసి నా గదిలోనే మరోమంచంమీద పసిపిల్లను పెట్టుకొని పరున్నది. అలసిఉండటంమూలాన రవంతసేపన్నా మాట్లాడకుండా నిదురపోయింది. మాచెల్లెలు ఒక అమ్మాయి నాతోనేఉంది. దానికి చిన్నతనం కావటంచేత నిదుర వేగిరం పట్టింది. నిద్రపోనిది నేనొక్కణ్ణి. శాస్త్రిగారు ఒకకథవ్రాసి పంపమని, వేగిరం కావాలని జాబువ్రాశారు. నాకు కథలు వ్రాయటం అలవాటుతప్పింది. ఈమధ్య చరిత్రకథలు వ్రాయటంమూలాన ఎండిపోయిన విషయాలు అంతకంటె ఎండిన గ్రాంధికభాషలో వ్రాయటం అలవాటై "చేవగల చిక్కని" తెలుగుపదాలలో కథఅల్లటం అలవాటు తప్పింది.

కథవ్రాసి పంపకపోతే నా ప్రియమిత్రునికి కోపం వస్తుందని భయం నన్ను పీడించటంచేత కలం కాగితం ముందరవేసుకొని ఏదోవకటి వ్రాసి పంపుదామనుకొన్నాను అదీగాక రచయితను ఎప్పుడూ వ్రాయమని నిర్బంధించ కూడదనీ, అట్లా బలవంతపెడితే యిల్లాంటి అవకతవకపు

వ్రాతలు బయటికి వస్తాయనీ, కథకుడి మనోవాహినిలో భావతరంగాలు పొంగినప్పుడే సరియైనకథ బయలుదేరు తుందిగాని మరో సమయంలో కథ రమ్మంటే రాదని నీతి పాఠం నిదర్శనరూపంగా చెప్పటానికి అయినా అవకాశం కలుగుతుంది అని వ్రాతకు పూనుకొన్నాను.

కాని ఏంకథ వ్రాసేది? ఒక్కమారు నాబుద్ధి ఈ విశాలమైన ప్రపంచంమీదికి పోయింది. ఎక్కడా నాకు కథకుకావలసిన సాహిత్యసామగ్రి దొరకలేదు. ఏదోమూల నుంచి ఎత్తుకుంటే అదే వస్తుందని ఒక పిచ్చినమ్మకంతో ఒకవిషయం ఎత్తుకొన్నాను. ఒక పల్లెటూరులోఉండే సాంఘికవిషయములు తీసుకొందామని ఒక మల్లంరెడ్డి అనే అతనిని సృష్టించా. రెడ్డి అనటంతోనే బుర్రమీసాలు, ఆజానుబాహులు జ్ఞాపకంవచ్చి ఆ రెడ్డికి అవన్నీ తగిలించి నల్లటిరంగేసి నిలుచోబెట్టాను. అక్కడినుంచి ఏమి చేయ వలసినది తోచిందికాదు. మావూరికి సమీపంలోఉన్న ఒక రెడ్డిగ్రామంలో జరిగిన విషయం జ్ఞాపకంతెచ్చుకొని ఆవిష యము కథగామార్చి క్లుప్తంగా వ్రాసినాను. అది ఏమి టంటే

మల్లంరెడ్డి చిన్నతనంలో బహుతుంటరి. బడిలో చదువుకొన్నంతకాలం ఉపాధ్యాయులను వేధించుకొని తిన్నాడు, ఒకమారు అతను కొన్ని కాకిఈకలు చిల్లపెం కులు కలిపి పొట్లంకట్టి పంతులుపై విసరాడు. అందుమీాద అతనిని బడిలోనుంచీ వెళ్ళగొట్టటంచేత అతని చదువు అంత

వేగిరం కొనసాగులు వేసింది. ఈబడి విడిచిన బండయొక్క దుర్మార్గప్రవర్తన మబ్బువిడిచినఎండలాగ ఎక్కువైంది. అతని చిత్తంవచ్చినట్లు తిరుగుతూ ఇచ్ఛాసమితిలో సభ్యుడైనాడు. రైలుస్టేషనులో అతను పోట్లాడని రోజులేదు. అతనిచేత దెబ్బలుతినని అరవటిక్కెట్టు కలెక్టరు ఆ చుట్టు పక్కల స్టేషనులలోలేడు. స్కూళ్ళలో మార్కులు వెయ్యని మేస్టర్లను కొట్టటం పెంకెతనంగా ప్రవర్తించే పూటకూళ్ళమ్మలకు బుద్ధిచెప్పటం ఆదిగాగల మహాకార్యాలుచేస్తూ ఇతడు సంఘసేవ చేయటం మొదలుపెట్టాడు.

అతని సౌశీల్యపరిణామములోని ప్రతిఘట్టము విస్తరించి వ్రాయటంకష్టం. అందుకని క్లుప్తంగా చెబుతాను. కొన్నాళ్ళకుఆతడు మెట్టవీధులు తడికలబజార్లుకూడా దర్శించటం సానుల కొంపలపైన రాళ్ళు రువ్వటం సాగించికొంత పేరు సంపాదించాడు.

అచిరకాలంలో అతడికి తాగుడు అలవాటయింది. మొదలు కొంచెంమత్తు కులాసా అయిన నిషాకోసం ప్రారంభించి తరువాత అలవాటుగా మార్చుకొన్నాడు.

పోగరుబోతులు త్రాగుబోతులు జారులు మొదలైన నిరక్షరకుక్షులయిన దుర్మార్గులతో స్నేహంచేస్తూ దుర్వృత్తిపాలై పాపపంకంలో క్రమేపి క్రుంగిపోయినాడు.

మల్లంరెడ్డి అంటే వూళ్ళోవాళ్ళు భయపడటం మొదలుపెట్టారు. చిన్నపురెడ్డి అంత ఆసామీ అని అంతా అన్నారు.

దేవుడితిరణాలలో రాంభాయి పిచ్చయ్యగారి ఇంటి ముందు ఎక్కువసేపుఆడి, మన రెడ్డి ఇంటిముందు తక్కువ సేపు ఆడింది. మల్లంరెడ్డికి వళ్ళు మండిపోయింది. పళ్ళు పటపటా కొరికాడు. ఆ విషయం తనస్నేహితులు నలుగురితో చెప్పి వాళ్ళ రక్తాన్ని కాచాడు. కొద్దిరోజులలోనే శుభముహూర్తాన సానిదానికి దేహశుద్ధి చేశాడు. అప్పటి నుంచి ఆవూళ్లో పిచ్చయ్యగారి కక్ష ఒకటి మల్లంరెడ్డి కక్ష ఒకటి, ఏర్పడ్డాయి.

మరికొన్నిరోజులకు పిచ్చయ్యగారి కక్షలోచేరిన ఒక ఆసామి ఎద్దు మల్లంరెడ్డి చేలోపడ్డది. రెడ్డి దానిని చంపేశాడు. దానితో కక్షలు పెరిగినయి. తలలు ఎగురుతవి అని ప్రతిజ్ఞ చేశారు.

దీపావళిపండుగరోజున అవ్వాయిజువ్వలు తోటాలు ఒకరుమీద ఒకరు కాల్చుకొని కొంత కసిదీర్చుకొన్నారు. వినాయకచవితినాడు ఉండ్రాళ్ళకుబదులు గుండ్రాళ్ళు ఒకరిపైనఒకరు వేసికొన్నారు. వారికి వీరికి మధ్య పచ్చగడ్డివేస్తే భగ్గుమనేది.

రెడ్డయ్య తనచేతిక్రింద ఇద్దరుముగ్గురు మాలవాళ్ళను ఉంచుకొని దొంగతనాలు చేయించటం ప్రారంభించాడు. ఆ వ్యాపారం లాభకరంగాఉండటంవల్ల మరికొంతమందిని చేర్చి బందిపోటులు చేయించడం, వాములు తగలబెట్టడం మొదలైన క్రూరకార్యాలు చేయించాడు.

ఆవూరిలో కొందరికి అప్పులుఇచ్చి అవిపెంచి వాళ్ళ

ఆస్తి కొంత తను కలుపుకున్నాడు.

ఆవూళ్లో పాపం ఒక ముసలిది ఉంది. దానిదగ్గర ఒక వెయ్యిరూపాయలు ఉన్నవి. అదే దానికున్న ఆస్తి సర్వస్వము. ఆముసలిది ఆసొమ్ము ఎక్కడైనా వడ్డీకి వేద్దామని చూస్తున్నదని తెలిసి అందరికంటె రెట్టింపువడ్డీ యిస్తానని ఆపైకం తాను తీసుకొని ఆనోటుకు కాలదోషంపట్టగా అతడు ఆపైకం కాజేశాడు.

ఆ ముసలిది పైకం అడిగితే "నీవు నాకియ్యనేలేదని" అని పైగా దానిని బయటికి గెంటించాడు. ఆ ముసలిది ఆ రోజునుంచి అన్నంలేక మలమల మాడిపోయింది. పైకం పోయిందనే దుఃఖంచేత మతి సంచలించి అది ఉన్మాదిని అయిపోయింది. ఆ పిచ్చిదిచింకిపాతలతో ఊళ్లో తిరుగుతూ "మల్లంరెడ్డి మాంసం తింటాను. వాడిరక్తం తాగుతాను. వాడిని పరాపరా కోయిస్తాను. వేడివేడిరక్తం తాగుతాను" అని అంటం మొదలుపెట్టింది.

దానిరూపు మరీభయంకరమైనది. అసలే భయంకరమైనముండ దానిపైన తిండిలేక శరీరం శుష్కించిపోయింది. దవడలు ఎండిపోయి అతుక్కుపోయినాయి. దానిపై పళ్ళు సహజంగానే ఎప్పుడూ కనబడుతూ ఉంటవి. ఇప్పుడవి కోరలలాగ భయంకరములైనవి. ఆ వికృతస్వరూపం, ఆకరాళదృష్టము ఆరజితకేశములు, బలహీనంచే వంగిపోయిన కాళ్ళు పెడపాదములు, ఊచపుల్లలలాంటి చేతులూ

గల శక్తిరూపాలు జూచి పట్టపగలుసహితం ఆవూళ్ళో వాళ్ళు భయంచేత కంపించేవాళ్ళు.

మల్లం రెడ్డి పొలానికి వెళ్ళేసమయంలో గుమ్మం ముందు ఈ వికటస్వరూపం తనచింపిగుడ్డలమూటతో నాట్యమాడేది. అతను పొలాన్నుంచి పొద్దుపోయి వచ్చే సమయంలో ఊరు వెలుపల పోలేరమ్మ గుడిప్రక్కన పెద్ద మఱ్ఱిక్రింద, ఆ చీకటిరాత్రిలో వికటనాట్యం జేస్తూ అతని ముందు ప్రత్యక్షమై "నీ రక్తం తాగుతానురా" అని రంకె వేసి అంతర్ధానమయ్యేది.

మల్లంరెడ్డి చేసిన క్రూరకృత్యాలవల్ల అతనినిజూస్తే ఊళ్ళో అందరికీ అసహ్యం వేసింది. అతని స్నేహితులే అతనిని ఒక్కరొక్కరూ వదిలివేసినారు.

పూర్వం స్నేహితులుగా ఉండి ఇప్పుడు వదిలేసినారని కోపంచేత మల్లంరెడ్డి వాళ్ళపై పగబూని వాళ్ళను సాధించాలని నిశ్చయించుకొని వాళ్ళ ఇండ్లు తగలబెట్టించినాడు. కోతకు సిద్ధంగా ఉన్న వాళ్ళ పొలాలను కోయించినాడు. కోసివేసిన కుప్పలను తగలబెట్టించినాడు.

అందుకని అతనంటే ఆవూరు చుట్టుపట్ల గ్రామాలు హడలిపోయినవి. ధనవంతుడూ బలవంతుడూ అవటంచేత అతనిమీాద పెట్టిన కేసులు గెలవటంలేదు. ఆతని దురాగతాలంతకంతకు ఎక్కువై పోయినది. అందరూ ఈ మల్లంరెడ్డిని ఎలా చంపుదామూ అని ఆలోచించినారు. కాని మల్లంరెడ్డిని జూస్తే భయము. రెడ్డిని జూస్తే భయం పిచ్చిదానికి కాని

పిచ్చిదాన్ని జూస్తే రెడ్డికికూడా కొంచెం భయంవేసేది. ఎన్ని దుర్మార్గపు కృత్యాలు చేసినా ఈ ముసలిదాన్ని చంపటానికి అతనికెందుచేతనో బుద్ధిపుట్టలేదు. దాన్ని చూచినప్పుడల్లా అతడు ఎల్లాగో తప్పించుకొని పోయేవాడు.

మల్లంరెడ్డిభార్య చాలా సుగుణవంతురాలు. ఆమెకు కలరా తగిలింది. జీవించుట కష్టమని వైద్యులన్నారు. రెడ్డి విచారంతో వీధి అరుగుపైని కూర్చొని యుండగా ఎక్కడి నించో ఢాకినీలాగ ముసలిది వచ్చి

మల్లంరెడ్డిని మడుచుకుతింటా

చిక్కని కండలు చీల్చుకుతింటా

అని పాడుతూ వికటహాసము చేస్తూ అతని ఇంటి ముందు నిలబడ్డది.

రెడ్డి పండ్లు పటపటాకొఱికి చంపుతా అన్నాడు పిచ్చిది పకపకనవ్వి పరుగెత్తిపోయింది. రెడ్డయ్య ముఖం ముడుచుకొని ఊరుకొన్నాడు. ఆతనిభార్య పిచ్చిదాని మాటలు విని భయంతో వణికి కాలంచేసింది.

హితముచెప్పే గుణవంతురాలైన భార్య చనిపోయిన దగ్గరనుండి మరింత క్రూరుడైనాడు. వూళ్ళో పసిపిల్ల బాలాది లాంటివాళ్ళే; అతని నాశనముకోరేవాళ్ళే;

మల్లంరెడ్డి పొలంలోకిపోయినాడు. చీకటిపడ్డది. ఆకాశంలో కారుమబ్బులు కప్పివైచినవి. మధ్యమధ్య తళుకు తళుకుమని మెరువులు. చీకటి వినీలకుంతలములను విరియ

బోసుకొని ఉన్మాదినివలె నృత్యము చేసినట్టు అతనికితోచింది. అంతలో అతనికి ఆ వృద్ధోన్మాదిని జ్ఞాపకంవచ్చినది. అతని దేహం అప్రయత్నంగా కంపించింది.

ఆ గాఢాంధకారంలో దూరాన ఏదో ఒకవ్యక్తి కదులుతున్నట్లు కనిపించివది. ఒకటికాదు రెండు, మూడు, అయిదు, ఏడు మరెన్నో వ్యక్తులు కదిలినవి.

నీవు దుర్మార్గుడివి

నీవు పాపివి

నిన్ను నరకంలో ఉక్కుస్తంభానికి కట్టి కొడతారు.

నిన్ను తప్తతైలంలో పడేస్తారు.

నిన్ను పరపరా అంపంతో కోస్తారు.

అతని రెండోచెవికి వినపడని కేకలు అతనికి వినిపించినవి.

అతడు ఉలిక్కిపడ్డాడు. ఏమిటిరా భ్రమ అని అనుకొని ఒక్కసారు ఒళ్ళు విరుచుకొని విదల్చుకొని ఆవలించి మళ్ళా నడిచాడు. అతనికళ్ళు భ్రమిసినవి. ఏమి కనబడ్డదో ఏమో నిలుచున్న పాటున నిలువబడి నిర్ఘాంతపడిపోయినాడు. ఏమిటి ఈ క్రూరుడికి కనిపించింది? అది ఒక చిత్రమైన దృశ్యము. ఒకటిగాదు కొన్ని దృశ్యాలు. ఒకమాటు పండినధాన్యము, కోసివేసినకుప్పలు తగలబడుతున్నట్లు, ఆ ఆసాములు కళ్ళనీళ్ళతో దిగులుపడి నిలుచున్నట్లు—వారి భార్యాబిడ్డలు అన్నానికి ఇబ్బందిపడి విలపిస్తున్నట్లు—ఒక దృశ్యము. ఇండ్లు వాటిలో సంవత్సరమునకు సరిపోను చేర్చి

పెట్టిన గ్రామంతోసహా తగలబడిపోతున్నట్లు, వాళ్ళంతా గోలుగోలున ఏడుస్తున్నట్లు ఒక దృశ్యము, అతనికి కనిపించినవి. రెడ్డికి దేహం కంపించింది.

అప్పుడే ఆ చీకటిరాత్రిలో ఎవరో నవ్వుతున్నట్లు పండ్లు పటపటా కొరుకుతున్నట్లు అతనికి వినపడ్డది. దీని వలన అతడు మరీ భయపడ్డాడు. ఉత్తరక్షణంలో ఆ పిశాచము, ఆ ఢాకిని ఆ ముసలిది ప్రత్యక్షమైంది. నీ రక్తం పీల్చుతానురా? అని రంకెవేసి ఆ పాతగుడ్డలమూట అతని ముఖానికేసి కొట్టింది. అసలే భయకంపితుడైన రెడ్డికి ఈ పాతగుడ్డలమూట అఖండలాస్త్రములాగా తగిలినది. కెవ్వన కేకేసి అతడు విరుచుకుపడ్డాడు. ముసలిది వికటహాసంచేస్తూ అక్కడే నుంచుంది.

ఇంతలోనే ఆ చీకట్లో ఎవరో పదిమంది రైతులు "కాడి" ఒకటి తీసికొనివచ్చారు. వాళ్ళు శవమువలె పడియున్న రెడ్డిని చూశారు. మరణించాడేమో అని కొంచెం సేపు అక్కడే నిలబడి పరికించారు. రెడ్డి తెప్పరిల్లి కదిలాడు. "ఏమిలేదు ముసలిదిరా" అంటూ లేవబోయినాడు. ఇంతలో రెడ్డి మెడపైన కాడి పడ్డది. "ఆ—ఆ" అన్నాడు రెడ్డి. ఇంతలో అయిదుగురు ఒకవేపు మిగతా అయిదుగురు మరోవేపు చేరారు. "ఊ" అని కాడిని గట్టిగా నొక్కారు. మళ్ళీ మాట్లాడకుండా రెడ్డి కట్టై అయిపోయినాడు. ఇంతలో ఆ ముసలిది ఎక్కడినుంచో వచ్చి వికటహాసం చేస్తూ "రక్తం" "దాహం" అని అరుస్తూ ఆ కటికచీకటిలో ఎగురుతున్నది.

అని వ్రాశాను.

ఎల్లాగో ఆ కథ పూర్తి అయింది అన్నమాటేగాని కథకు కావలసిన హంగులు దానికి లేవు మూడుముక్కలలో కట్టి కొట్టి తెచ్చె అనివ్రాస్తే కథకుని చమత్కారంపముంది. అది ఒక Work of art గా ఎల్లా పరిగణిస్తారు. మొదలు పెట్టటంలో చమత్కారం, నడపటంలో నేర్పు, ముగించ టంలో ముచ్చట, కథకుడికి ఉండాలి. ఒకచోట కథ ఎల్లా తేల్తుందా అని పాఠకునికి ఆదుర్దా కలగాలి, విసుకు రాకూ డదు. కథ కుదురుగా ఉండాలి. ఇవన్నీ లేకుండా మూడు ముక్తాయింపు మాటలతో ముగిసే కథ ముక్కచెక్కలు గానే ఉంటుంది.

నే వ్రాసినకథ పెంచాలని ప్రయత్నించాను. కొన్ని వర్ణనా భాగములు పెంచాను. రెడ్డి నడతను సూచించే మరి కొన్ని విషయాలు చేర్చాలని ప్రయత్నించాను కాని అది ఇమడలేదు. చిత్రకారుడైనా రంగులు సరియైనపాళ్ళలో కలపాలి గాని, చిత్రము బాగుండాలని రంగులు ఎక్కువ దట్టంగా పూస్తే అది పాడైపోతుంది. సరే ఏం జేస్తానని అల్లాగే ఆ కథను వదిలేసి కాగితాలు అల్మరలో పెట్టి మడతకుర్చీ ముడిచి మూలనానించి నేను మంచంమీాద నడుము వాల్చాను నిద్రపోదామని.

అప్పటికే ప్రొద్దుపోవటంచేత బాగా నిద్రపట్టింది. నేను పడుకొన్న గదికి వెనుకనే మరోగది ఉంది. అందులో మా చెల్లెలు నిదరోతున్నది. మాగదిలోనుంచి ఆ గదిలో నికి వాకిలి ఉంది. తలుపులు తెరిచే ఉంచాము. రెండు

గదులకు మధ్య ఒక బుట్టపైన లాంతరుపెట్టాము. ఆ లాంతరు కెదురుగా వరండాలోకి పొయ్యే వీధి వాకిలితలుపు ఉంది. వీధి వాకిలి తలుపుకు ఎదురుగానే లోపలిగది ద్వారము ఉందని చదువరులు జ్ఞాపకం ఉంచుకోకపోతే కథ అర్థంగాదు.

కొంతసేపటికి నాకు నిద్ర మెలుకువ వచ్చింది. నేను కళ్ళు తెరిచేచూచేసరికీ మేము పడుకొన్న గదిలోనుంచి వీధివరండాలోకి పొయ్యే తలుపు బార్లాగా తెరిచి ఉంది. పసిపిల్ల మంచంలో తల్లిలేదు. మాచెల్లెలు మధ్యయింట్లో ఉండటంమూలాన దాని సంగతి నాకు జ్ఞాపకం రాలేదు. నా భార్య బైటికి వెళ్ళింది కాబోలు మళ్ళావచ్చి పడుకొంటుంది అని అనుకొని మళ్ళా నిద్రపోయాను. ఈమాటు నాకు కలతనిద్రపట్టింది. అప్పుడు నాకొక భయంకరమైన కలవచ్చింది.

ఒక విమర్శకుడు కథ పూర్తిగా చదివి ఇప్పుడు వ్రాసిన రెడ్డికి సంబంధించిన కథా, ఆ కథ ననుసరించి వచ్చిన కలా అసలు కథకు ఆట్టే సంబంధంలేదని అనుకొని చిరునవ్వుతో తన నిరసనభావాన్ని వెల్లడిస్తున్నాడు. ఆ రాత్రి నేనటువంటి కథ వ్రాయబట్టే నాకటువంటి కల వచ్చింది. ఆ కలవల్లనే నేనారోజున అట్లు ప్రవర్తించవలసి వచ్చింది. ఆనాడు రాత్రి ఆ విపరీతప్రవర్తనకు ఆకలే కారణం.

ఏమిటి ఆకల! నేనే మల్లంరెడ్డినట. నన్ను రైతులు గొంతుమీద కాడివేసి, పాటలుపాడుతూ, నవ్వుతూ కాడి మీద నృత్యము చేస్తున్నారట. నాప్రాణం పోదు. కాని

మిక్కిలి బాధ అనుభవిస్తూ అరుద్దామని నోరె త్తితే రాదట.

ఇంతలో నిద్ర మెళకువ వచ్చేసరికి వసారా గుమ్మం దగ్గర మా అమ్మాయి నిలబడి ఏడుస్తున్నది. బుట్టమీద దీపం మందంగా వెలుగుతున్నది.

అప్పుడు నాకేమని తోచిందో నే చెప్పలేను. పిల్ల పక్కలో కాంతం లేకపోవడం మా చెల్లెలు ఆ మంచం పక్కనే నిలబడి ఏడ్వటం చూచేసరికి కాంతం బయటికి ఎందుకో వెళ్ళితే అక్కడ ఎవరో దాన్ని కొట్టారనో, లేక పోతే పాముకరచి అది అక్కడ పడిపోయిందనో, నాకు భయంవేసింది. లేచి చప్పున వెళ్ళి ఆ అమ్మాయిని కౌగి లించుకొని ఏమిటే అమ్మా ఏమిటే—ఏమి వచ్చిందే అని బిగ్గరగా అరిచాను. అప్పుడే దానిభయం పోవాలని వీపు మీద గట్టిగా చరిచాను. అదేమీ మాట్లాడలేదు.

అటు చూద్దునుగదా మా అమ్మాయి వెనుకనే కాంతం ఏడవలేక ఏడవలేక ఏడుస్తున్నది. పాపం ఎంత సేపటి నుంచి ఏడుస్తున్నదో కాంతం ముఖంలో నెత్తురు బొట్టులేదు. కళ్ళలో దానిభయం అంతా కనిపిస్తున్నది. ఎందుకో అంత భయం నాకు తెలియదు. వీధిలోనికి పోయి నప్పుడు ఏమైనా కుట్టిందా? లేక ఏమిఉపద్రవం వచ్చిందో? అని నేను హడిలిపోయాను. అది నిలుచో లేనిస్థితిలో ఉన్నట్లు గ్రహించి దానిని చేతిలోకి తీసుకొన్నాను. నాచేతులలో అది పడిపోయింది. చేతులలోబరువు పడటంచేత నేను పిల్ల

మంచంమీద కొంచెం కూర్చున్నాను.

ఇప్పటికిని వాళ్ళు నాకు ఏమీచెప్పలేదు. నా గుండె జారిపోయినది. కాళ్ళు తడబడ్డాయి. ఇంట్లో ఇంకెవ్వరూ పెద్దవాళ్ళు లేరు. ఉన్న ఇద్దరు ఆడవాళ్ళు బెదురుచూపులతో హడిలిపోయి ఏడుస్తున్నారు. ఫలానా సంగతి అని చెబితే అయినా బాగుండును. ఏమిటిచెప్పండి అని గొంతు పగిలిపోయేలాగున కేకవేశాను. ఆ కేకకు వాళ్ళు మరింత భయపడి ఏడ్చారు. వాళ్ళచూపులు చూస్తే ఎంతవాడికైనా భయం కలుగక మానదు.

ఏమి ఉపద్రవం వచ్చిందో ఏం జూశారో, ఇంటికి ఏమైనా నిప్పు అంటుకొందా ఏమైనా కుట్టిందా అని వెయ్యి ఆలోచనలు ఒకక్షణంలో నా బుర్రలో మెరుపుదీపాల లాగ మెరిసిపోయినాయి.

కాంతం ఏమాత్రం పలికే స్థితిలో లేదు. కాని నేను పిల్లమంచంపైన కూర్చోటం చూచింది. నేను ఆ హడావుడిలో పిల్ల ఎక్కడుందో చూడలేదు. కాని ఇంత భయములోకూడా ఆతల్లి ఒక కన్ను ఆ చంటిపిల్లమీదనే ఉంచింది.

నేనెక్కడ పిల్లమీదకూర్చున్నానో నాకు తెలియదు. కాంతం పిల్ల పిల్ల అని అరిచింది. ఆ మాట వినటంతోనే పిల్లకేదో జబ్బుచేసింది అందుకని ఏడుస్తున్నారని అనుకొని వెంటనే మా కాంతాన్ని క్రిందికి వదిలేసి పిల్లవైపు తిరిగాను. పిల్ల కులాసాగా ముత్యంలాగ నిదురపోతున్నది.

పిల్ల నిదురపోతున్నప్పుడు ఎందుకేడుస్తున్నారా అని నేను హడలిపోయినాను. ఇంతలోనే పిల్లను ఇల్లా ఇవ్వండి అన్నది కాంతం. నేను మళ్ళీ ఆలోచనలేకుండా పిల్లను ఒక్క రెక్కతో లాగి తల్లికి అందిచ్చాను.

ఇంతలో కాంతం మా అమ్మాయి కూడ ఆమధ్య ఇంటివేపు చూస్తూ హడలిపోయే చూపులు చూస్తూ గజా గజా వణుకుతూ ఒకచెయ్యి అటుచూపి క్రుంగిపోయిన గొంతుకతో "దొంగలు దొంగలు" అన్నారు. తరువాత చతికలబడ్డారో అట్లాగే ఏడుస్తూ నిలుచున్నారో జ్ఞాపకం లేదు.

3

నాకు ఈ హడావుడివల్ల కలత నిదురవల్ల కలలవల్ల బలహీనం కలిగింది. అందుచేత మళ్ళా మాట్లాడలేకపోయి నాను. గుండెలో రాయిపడ్డట్టు ఏదో గుభేలు మనిపించింది. కాళ్ళు గజాగజా వణికినవి. దొంగలుఉన్న గదివైపు చూశాను. అక్కడ ఎవ్వరూ నాకు కనిపించలేదు

కొంచెం ధైర్యం తెచ్చుకొని నేనూ "అక్కడ ఎవ్వరున్నారే! ఎవ్వరు లేరే" అన్నాను. అయినా బాగా చూద్దామని అటువైపు లాంతరు పుచ్చుకొని నడిచాను. కాని కాంతం నాచెయ్యి పట్టుకొని చప్పున వెనక్కులాగింది.

దానితో నాకుఉన్న ధైర్యంకాస్తాపోయి వట్టి అబలనై పోయినాను.

దొంగలయితే యింతసేపు కేకలు వేస్తూ ఏడుస్తూంటే అక్కడే ఉంటారా? ఎవరో విరోధులు మనలను జళిపించాలని వచ్చారని అనుకొన్నాను. అటువైపు తిరిగిచూశాను. అక్కడ నాకొకనీడ కనిపించింది. తల రేగిఉంది—కాళ్ళు వంకరగాను చేతులు లావుగాను ఉన్నవి. నేను కలలో చూచిన ముసలిది నాకు మళ్ళీ ప్రత్యక్షమైంది. ఆ వికట స్వరూపం ఇదివరకే నా మనస్సులో ఉంది. ఇప్పుడది కట్టెదుట కనుపించింది. నాకు భయంచేత వళ్ళు వణికింది నోట మాటరాలేదు. ఆఖరుకు ఏమిచెయ్యటానికి తోచక దొంగలు దొంగలు అని అరవాలని అనుకొన్నాను. కాని గొంతు పూడిపోయింది. మాట ఒకతీరాన రాలేదు. కాని రెండు మూడు నిమిషాలలో ఎల్లాగో ధైర్యము తెచ్చుకొని దొంగలు దొంగలరోయి! డాకినీ! కూనీకూడా! అని పెద్దగా అరిచాను.

ఇంతలో పిల్లనెత్తుకొని కాంతం వరండాలోనికి పోయింది. మా అమ్మాయి నేను గడపలోనే ఉన్నాము. వసారాకొట్లో అద్దెకున్న రాజుగారు కర్రచూడండి అని కేకవేస్తున్నారు. రవంతసేపులో రాజుగారు మాయింట్లో అద్దెకున్న డ్రాయింగుమాస్టరుగారూ ఇంటో పనిచేసే బుచ్చమ్మా వచ్చారు. నేనువాళ్ళ వెనక్కు తగ్గి వాళ్ళను ముందుకుతోశాను. మా అమ్మాయి గడపదాటి వదినతో

కలుసుకొన్నది. నా ప్రాణాలు ఎగిరిపోతున్నవి. దొంగ ముండావాడు ఇంట్లో ప్రవేశించాడు. పైగా కేకలువేసినా పారిపోడాయె. ఎట్లాగతి!

మేమంతా లాంతర్లు పుచ్చుకొని లోపలి గదిలోకి పోయినాము. అక్కడ ఎవ్వరూ మాకగుపించలేదు. తలుపులు గడియలు వేసిఉన్నాయో లేదో మేము పరీక్షించలేదు. మా వెనుక పనిజేసే మనిషి బుచ్చమ్మ వుంది. "అదుగదుగో దొంగ పారిపోతున్నాడని"అని కేక వేసింది. అంతా ఆ ఇంట్లోనుంచి మళ్ళీ యీ యింట్లోకి వచ్చాము. రోడ్డుపైన ఏదో మనిషి అలుకుడు వినిపించింది. ఇంతలో ఎవరో లాంతర్లతో వస్తున్నట్లు కనిపించింది. సరే దొంగలను వాళ్ళు చూచి పట్టుకొంటారని నేననుకొన్నాను.

తరువాత మళ్ళీ మధ్య ఇంట్లోకి రెండు లాంతర్లతో ముగ్గురు మొగాళ్ళము వెళ్ళాము. ఇల్లు పరికించి చూద్దుము గదా కిటికీలు తలుపులు ఎక్కడికక్కడ బిగించి ఉన్నాయి. దొంగలెట్లా వచ్చారంటే ఎట్లా వచ్చారని అందరూ అడిగారు. కన్నం ఎక్కడా లేదు. ఒకవేళ వాకిలి తలుపు తెరిచి ఉండటంవల్ల వస్తే ఎల్లా వెళ్ళాడు? దొంగలను చూచిన తరువాత మేము ద్వారందగ్గరే ఉన్నాము. మరి దొంగలు ఎల్లా పారిపొయ్యారు!

ఆఖరుకు ఏమి తేలిందో ఇప్పుడు చెప్పను! మా ఆవిడ చెప్పేకథ కూడా విన్న తరువాత దొంగలు ఎల్లా వచ్చింది ఎల్లా పారిపోయింది చెబుతాను.

## 4

నేను గృహకృత్యములు తీర్చుకొని వంటయిల్లు కడిగి తలుపులన్నీ సరీగ్గా గడియవేసి ఆడబిడ్డకు మధ్య యింట్లో పరు వేసి ముందు యింట్లో రెండుమంచాలు వేశాను. ఒక మంచంమీద పరు పేశాను. రెండో మంచంమీద గొంగళ్ళు పరచి దానిపైన దుప్పటి వేసుకొని నేనూ పిల్లా పడుకొన్నాము. మావారు ఏదో వ్రాసుకొంటూ కూర్చున్నారు.

పాలు మంచంక్రింద పెట్టుకొని నిద్రవచ్చే సమయంలో పాలు తాగుదాములే అనుకుని పిల్లకు పాలిస్తూ పడుకొన్నాను, నాకు తెలియకుండానే నాకు నిద్ర పట్టింది. మరికొంత సేపటికి ఆయన నన్ను లేపి పాలు తాగమని చెపటం, నేను విసుక్కొంటూ మత్తుగానే ఆ పాలు నోట్లో పోసికొని మింగటం నాకు జ్ఞాపకమే. దాని తరువాత ఎంత సేపు నిద్రపోయేనో తెలియదు కాని నేను వదలిపెట్టిన పాలు కొన్ని పిల్లి తాగటం అలుకుడై మేలుకొన్నాను. పిల్లిని తోలేసి ఆడబిడ్డను లేపుకొని బైటికి వకటి కెళ్ళాం.

వసారాలో అవ్వగారు బుచ్చమ్మ కూర్చుని మాట్లాడుతున్నారు. మేము అక్కడికెళ్ళి కూర్చొని ఆమె చెప్పే కబుర్లు విన్నాము. అర్థరాత్రివేళ ఏం కబుర్లు అంటారేమో పక్క ఇంట్లో ప్లీడరుగుమాస్తా తన భార్యను కొడితే ఆమె ఏడుస్తున్నది. ఆమె ఎందుకు ఏడుస్తున్న దండీ అని నేను అడిగితే ఆమె ఏమేమో కబుర్లు కొన్ని చెప్పింది. ఈ కబు

ర్లతో ఒక అరగంట కాలం గడిచింది. ఇక పడుకొందా మని మా ఆడబిడ్డ అన్నందువలన మేమిద్దరము ఇంట్లోకి వస్తున్నాము.

ఇంతలో నాకు అయ్యో ఇంతసేపూ ఈ తలుపు తెరిచి పెడితినే ఎవరైనా జొరబడిఉండరా అని భయం వేసింది.

గుమ్మందాటి ఇంట్లోకి తొంగిచూచాను. ఆ లోపల తడిక నానుకొని ఇద్దరు మనుష్యులు నిలుచున్నారు. అందులో ఒకడు కొంచెం పొడగరి. ఒకడు పొట్టివాడు. ఒకడి తల మాత్రం రేగి బుట్టలాగుంది.

యమభటులలాంటి ఇద్దరు మనుష్యులను నాకట్టెదుట చూసేసరికి కన్ను చెదిరిపోయింది. పై ప్రాణాలు పైన ఎగిరి పోయినాయి. కొంచెం ధైర్యంచేసుకొని కళ్ళువిప్పి వంగి తేరిపార జూచాము నేనూ మా ఆడబొడుచూనూ. మనిషి అలికిడి వాళ్ళు విని కాబోలు మావంక తొంగిచూచారు.

ఇక నేనేమిజెప్పేది! ప్రాణంపోయిన కట్టెలాగ మొద్దు బారింది నాదేహం! వెనక్కుపోలేక ముందుకూ రాలేక అక్కడే నిలబడ్డాను. ఆడదాన్ని ఎప్పుడూ ఒంటరిగా కాపు రం చెయ్యనిదాన్ని ఇటువంటి దృశ్యముజూచి ఎంత హడిలి పోయానో ఎంత వణకిపోయానో నేను మాటలలో చెప్ప లేను. మేమిద్దరం గొల్లునపడ్డాం. అటు తరువాత దొంగల కోసం వెతికాం. కనిపించలేదు. మరి ఎల్లాపొయ్యారో భగ వంతునికి తెలియాలి.

మమ్మల్నలను ఏదో భయం పట్టుకొంది. చీమ చిటుకుమన్నా మేము ఉలిక్కిపడేవాళ్ళం. జరిగిన విషయమంతా నేనో మారు మా కాంతం ఓమారు, మాఅమ్మాయి ఓమారు చెప్పుకొన్నాం.

నేను నిద్రపోవాలని కళ్ళు మూసుకొనేసరికి ఆ కిటికీలోనుండి ఇద్దరు దొంగలు ఒక వికృతాకారంగల ముసలిది తొంగిచూస్తున్నట్లు నావంక తిరిగి పండ్లు పటపటా కొరుకుతున్నట్లు కల వచ్చింది.

మాయింట్లో దొంగలుపడి ఉన్న వస్తువులన్నీ ఎత్తుకొనిపోయినట్లు కాంతానికి కలవచ్చినది.

దొంగలువచ్చి కిటికీచువ్వలలో ఇరుక్కున్నట్లూ వాళ్ళు అందులోనుంచి బైటపడేలోపల తాను అక్కడినుంచి పారిపోవాలని ప్రయత్నంచేస్తుంటే కాళ్ళుఆడనట్లూ మా అమ్మాయి కలగన్నది.

ఇట్లా రాత్రంతా భయంకరమైన రంగంలో గడిపాము దయ్యాలమధ్యపారేసినా అంతకష్టం అనుభవించేవాళ్ళము గాము. ఏ బాధలేకుండా తెల్లవారుజామున అయిదుగంటలకు నవ్వుతూ లేచింది మా పసిబిడ్డఒక్కతే.

# సప్తాహం

గోపాలునికి ఏమీపనిలేదు. చదువుకొన్న వాళ్ళకే పనులుదొరకక పోతుంటే, ఏదో నానాకాలపుచదువు రెండు ముక్కలు చదువుకొన్నవాళ్ళ మాటచెప్పాలీ? అయితే ఒక విషయము ఆలోచించాలి. ఉద్యోగంఅనేది సేవ, అంటే ఒకరికింద నౌకరిచేయటం స్వాతంత్ర్యానికి విరుద్ధము.అందు చేత గోపాలం పూర్తిగా స్వతంత్రజీవనము చేయటానికి పూనుకొన్నాడు, "అడిగినజీతంబివ్వని మిడమేలపు దొరను గొల్చి మెలగంగంటెక్ వడిగల యెద్దులగట్టుక మడిదున్నక బ్రతుకవచ్చు మహిలో సుమతీ," అని మహాకవి పాడుతున్నాడు. అయితే మడిదున్నక మనుగడ గడపటానికిమడి అనే పదార్థము ఒకటి ఉండాలి; మడిలేకపోతే ఏమిటి దున్నటం అనే తర్కాన్ని సాధించటం ఎల్లాగ?

వర్తకం ఒకటి ప్రతినిరుద్యోగికీ ఆదర్శము; గోపాలానికి కూడా అదే ఉద్దేశం కలిగి తీవ్రంగా ఆలోచించి తెగించి ఒక వ్యాపారంలో వేలుబెడితే అందులో నష్టం వచ్చింది. తలదువ్వుకొని గ్లాసోమల్లు చొక్కా తొడుక్కొని మల్లుబట్ట కట్టుకొని పయిన ట్వీడుకోటు తగిలించి సిజర్సు సిగరెట్టు వెలిగించి తెనాలి వీథులలో తిరుగుతుంటే ఎన్నాళ్ళు జరుగుతవి గోపాలానికి?

జరగనప్పుడు చేసేపనిఏముంది మరి? ఎవరిదగ్గరకో ఒకరి దగ్గరకు వెళ్ళి, వరేభాయి ఈరోజు చాలాయిబ్బందిగా ఉంది, పైకం అందలేదు రేపుసాయత్రం తెచ్చియిస్తాను. పది రూపాయలు ఉంటేయిద్దూ" అనటమే గదా!

వాడు పదిరూపాయలు లేవంటాడు తప్పకుండాను. "లేకపోతే ఏదోచూడు నాలుగైనా" అతనిదగ్గర నాలుగైనా లేక రెండుఇస్తాడు.

రెండుకోసం పదిఅడిగితే రెండు వచ్చేటప్పటికిగగన మైంది. అదివచ్చినంతేచాలు గోపాలానికి. రేపు ఇంకోడ్ని బోల్తా వెయ్యవచ్చు. ఇల్లా అప్పులమీద ముప్పు గడుపుతు న్నాడు.

ఒకరోజున రాత్రి భోజనానంతరం తాంబూలంవేసి కొంటూఉంటే భార్య మెల్లిగా దగ్గరజేరింది ఇల్లా మాట్లాడారు వారు—

"ఏబాధ అయినా పడవచ్చుగాని ఋణబాధపడ లేము! ఈ ఊరంతా అప్పులే అయిపోయినయి. ఇవి తీర్చ డము ఎల్లాగ? ఈ ఋణం తీరటం ఎప్పుడు, నాకు కాస్త మెడలో పచ్చబడడమెప్పుడు? మీరు గట్టిగా ఆలోచించక పోతే ఏలాగ?"

"ఏమో నేనుమట్టుకు ఏంచెయ్యను? నాకు ఏమీ తోచటంలేదు. ఏమిటికీలకం? ఏదో కోరినసొమ్ము ఇస్తారను కొన్నానుగాని ఇల్లా అప్పులలో మునిగి తేలతారనుకోలేదు; మావాళ్ళు మీరేదో ఉద్యోగాలు చేస్తారనుకొన్నారు!

ఛా! అవన్నీ గాలిలో మేడలు! ఒట్టి వెఱ్ఱితనం! అయినా అని గోపాలం కొంచెంసేపు ఆలోచించి చూడూ! నీకు కార్తీకమాసంలోగా సరుకు చేయిస్తే సరిగద! అన్నాడు.

రేపటికి ఇంట్లో బియ్యంలేవు అన్నది భార్య!

## 2

గోపాలం మొదటినుంచి ఎలాగో అలాగు బాగా బ్రతికాడు. ఈ రోజుకు ఇల్లా అప్పులతో "మునగానాం తేలానాం" అయింది. అదిగాక టీ తాగటం మానెయ్యవలసి వచ్చింది. బుద్ధిమంతుల లక్షణం కష్టాలనుంచి గట్టెక్కడమే. మూడు నిమిషాలలో మూడువందలరూపాయిల అప్పుఅయినా తీర్చ గల బుద్ధిమంతులు గలరు. గోపాలానికి సాధనం సంపాదన కాదు. సంసారం అంటే కించిత్ విరక్తి గూడా జనించిందని అనవచ్చు. ఎందుచేతనంటే ఆ రోజు సాయంత్రం ఆరు గంటలనుంచి అతను అమాంతంగా రామభక్తుడైనాడు. వావిళ్ళ రామస్వామి అండ్ సన్సునుంచి మూడోరోజుకు ప్యాకెట్టు వచ్చింది. బైండుగట్టి తెలుగు లిపిలోఉన్న గీత, సుందరకాండ; అవి పారాయణ ఆరంభించాడు. ఉదయం ఎవరైన వారింటికి వెళ్ళితే గోపాలం లేడిచర్మంమీద కూర్చుని గీతాపారాయణం చేస్తుంటాడు. ప్రక్కన రాగి చెంబు, పంచపాత్ర, ఉద్ధరణీ ఉంటవి. అప్పుడే గోపాలం భక్తుడైన సంగతి పాకింది. ఊళ్ళో నెలరోజులు కాక ముందే క్రాపింగు మాయమయింది. పిలకజుట్టు అతను బుర్రను అలంకరించింది. నిత్యకర్మానుష్ఠానములు జరుగు

తున్నవి. హోమంలోకిగూడా దిగింది.

"గోపాలం మరీ పిచ్చిన బడుతున్నాడే. వయసు తనంలో ఈనీమాలు గోమాలు ఏమిటి"అన్నది ఒకామె.

మరో ఆమె "అల్లాఅనగూడదు. ఒక్కొక్కరి పూర్వ జన్మ పుణ్యం. ప్రహ్లాదుడికి ఎన్నేండ్లమ్మా?" అన్నది.

"వీడి మొఖం, మొన్నటిదాక నానా పిచ్చిపనులు జేస్తూ అంతలోనే యింతభక్తి అమాంతంగా కుదిరింది కామాసు?

"అల్లా అనకువదినా! కర్మవిమోచనమయితే ఎంత సేపు మారాలె. అహల్య ఎన్నాళ్ళనుంచో బండరాయియై పడుండి మహానుభావుని పాదకమలం తాకటంతోనే లేచి కూర్చున్నదికాదు;" అన్నది మొదటి ఆమె: ఎవరే మన్నా గోపాలం భక్తుడని పేరువచ్చింది. ఎవరో మహాను భావుడు ఆయనకు ఉపదేశం చేశారని పంచ ముఖాంజ నేయులు ఆయనకు ప్రత్యక్షమవుతాడని ప్రసిద్ధంగా జెప్పు కోవటం మొదలుపెట్టారు. ఆంజనేయులు ప్రత్యక్షమవుతా డట; నిజమేనురా గోపాలం అన్నాను, ఏదో అలా వెళ్ళి పోయి వస్తున్నది; యీ రెండు నెలలునుంచి భోజనానికి ముందు రాత్రి ఆయనవచ్చి పూన్తాడు. అప్పాలు పోయించ మని నాకు ఆహారం చాలడంలేదని నన్ను ఆజ్ఞాపిస్తే దేవుడి ఆజ్ఞ చెల్లించే నిమిత్తం ఎవరైన భక్తులదగ్గరకు వెళ్ళి ఆయన కోరిక నెరవేరుస్తాను. కొబ్బరికాయలు కావాలని నిన్న తన్నకపోతే ఆ కోమటిసుబ్బయ్యనే తంతే తేలిపో

తుందిగా వాళ్ళింటో కావలసినన్ని కొబ్బరికాయలున్నాయి తన్ని కొట్టించుకోరాదు. ఆ! ఆ! అల్లాగే భగవంతుడు తన భక్తులద్వారా తన కోర్కె నెరవేర్చుకొంటాడు.. భక్తుల ద్వారా నెరవేర్చుకోకపోతే యెకాయెకిని కొబ్బరికాయ కొట్లోకి వెళ్ళి కావలసినన్ని కొట్టుకుతినగూడదా?. ఏడిశావులే! బుర్రమీద రెండు వెంట్రుకలు మొలవంగానే వికట వాదాలు నేర్చుకొన్నావా?, అని ఇక మాట్లాడనివ్వలేదు. గోపాలానికి వూళ్ళో ప్రాపకం కుదిరింది. తలచెడిన కొంత మంది స్త్రీలు ఆయనదగ్గర ఉపదేశం అవటానికి, కొందరు గీతారహస్యంలో రెండుముక్కలు నేర్చుకొంటానికి వస్తున్నారు. ఊరంతాగూడా గోపాలంగారు మంచివేత్త అనీ వేదాంతి అవి అనుకొంటున్నారు, కర్మిష్ఠిగూడా అని.

కొన్ని రోజులకు ఆయనకు ఒకయజ్ఞం చేయాలని బుద్ధిపుట్టింది. కొందరితో ఆ విషయమై ముచ్చటించాడు. అంతా మహాబాగుందన్నారు. కార్తీకమాసంలో సప్తాహం చెయ్యడానికి పూనుకొన్నాడు. ఆ సంగతి పదిమంది రైతులతో చెప్పాడు, కొంతమంది తమ ఊళ్ళో కూడా సప్తాహం జరిగిందనే గౌరవం పొందాలని జయప్రదంగా జరుపుటకు పూనుకొన్నారు.

ఒకరోజున మా యింటికివచ్చి మా తాతతో ఏమండోయి! బాబుగారు పెద్దకార్యం తలపెట్టాను. అంతా సహాయంజేస్తేనే కాని మీ దైవకార్యం నెరవేరదు. రాత్రింబ

వళ్ళు నిద్రలేదు బాబూ ఆదుర్దావల్లా. ఎల్లా నెరవేర్చు కొంటాడో రాముడు.

మన దేముందిరానాయనా! అంతా వాడిదే అన్నాడు ముసలాయన.

అంతేనే బాబు ! మన మేమో జేస్తున్నామని తల మీద పెట్టుకొంటాము. కాని మనం జేసేది అణుమాత్రం లేదు. అంతా రాముడిదే! ఎవరింట్లో పెండ్లి యిది! రాముడి పెండ్లి, వాడిపెండ్లి వాడే జేసుకోవాలి. నేనల్లా యీ పని చెయ్యి అంటే ఆ పని చెయ్యడమే. ఆయన దాసుణ్ణి ఫలాని వారి యింటికివెళ్ళి నా కార్యానికి ఒకరోజు ఖర్చు అడగరా అంటే అడుగుతా, అంతే నాపని.

అవునుగాని నీవు అప్పులలో మునిగియున్నావని విన్నాను. ఈ సమయంలో యీ ఖర్చు పెట్టుకొన్నావు అవి ఎల్లా తీరుతవి?

ఎల్లా తీరుతవా? వాడే తీర్చుకొంటాడు.

రామదాసు అప్పులు యెవరు తీర్చారు? అర్థరాత్రి వేళ అడావుడిగావచ్చి అప్పులు తీర్చుకొన్నాడా లేదా బాబు? మనదేవుంది చేసేవాడ్ని నేనా?

"పలికెడిది భాగవతమట
పలికించెడివాడు రామభద్రుండట నే
బలికిన భవహర మగునట
పలికెద వేరొండుగాథ పలుకగ నేలా!"

అంతా వాడిదే.

"అంతా రామమయం ఈ జగమంతా రామమయం॥

అండాండంబులు........................ ...అంతా రామమయం"

ప్రొద్దుపోతున్నది వెడతాబాబు.

'ఒకరోజు ఖర్చు మీామీాద భారం ఏమంటారు?"

'అంత భరింతలేము నాయనా ఏదో తోచింది యిస్తాలే.'

'రామార్పణం. పోనీ ఒకబస్తా...'

'సరే.'

'ఏమండీ గోపాలంగారు సప్తాహం ఎందుకండీ అన్నా నేను.'

దైవప్రీతికొరకు. ఇంద్రులు దేవతలు కూడా సంతోషించి కర్తకు స్వర్గం యిస్తారు! అన్నాడు గోపాలంగారు.

అయ్యో ఎక్కడో మనకు కనిపించని ఇంద్రలోకంలో సర్వ సౌఖ్యములతోను వైభవములతోను తులతూగుతూ రంభ తిలోత్తమలతో సర్వసౌఖ్యం అనుభవిస్తూ ఉన్న ఇంద్రుడినీ, అమృతంతాగి ఆకలిదప్పులులేక నిర్వికారంగా ఉన్న దేవతలనూ సంతోషపెట్టకపోతే నీ కళ్ళముందు మురుగు కాల్వలలో బడి అన్నంలేక పుల్లాకులు నాకుతూ ఆకలితో అల్లాడిపోతున్న వాళ్ళకు ఏమైన అన్నందొరికే సదుపాయం చూడరాదు?

ఛీ ఛీ ఇదేమి వెధవసంతరా? మాలమాదిగలకును ఎలికల యూనాదులకూ సంతర్పణ జేయమంటావు.

వాళ్ళెంత పాపం జేసుకొంటేనో ఆజన్మం ఎత్తారు, వాళ్ళ మొఖం జూడగూడదు.

"అవును. వాళ్ళకుపెడితే దేవుడు సంతోషించడు. రోజు ఏసంతర్పణ, ఏ బ్రాహ్మణార్థము తగిల్తేనో, దిట్టంగా గొంతువరకూ తింటున్న వాళ్ళకే మళ్ళీ వారంరోజులు ఒళ్ళు కదలకుండా కూర్చోబెట్టి మేపాలగాబోలు" అన్నాను. ఆయనకు కోపంవచ్చి—"ఒరి వెధవాయా యీ కాలంలో యింకా యజ్ఞాలుచేసి బ్రాహ్మణసంతర్పణలు ధాటిగాచేసి బ్రాహ్మలను సంతోషపెడితేనే మీకు స్వరాజ్యం వచ్చేది. అసహాయవాదిని నీవు యిల్లాగ అంటావే, అని గట్టిగా అన్నాడు.

3

సప్తాహం భోగట్టా చుట్టుప్రక్కల అంతా కారు చిచ్చులాగ కమ్ముకొన్నది. ఎక్కడజూచిన సప్తాహంభోగట్టాలే. చుట్టుప్రక్కలనేగాక యిటు బందరు ఏలూరుదాకా యిటు వినుకొండ దొనకొండదాకా పాకింది, వారం రోజులు నిశ్చింతగా భోజనం చెయ్యొచ్చు. అడిగేవాడు లేడు. నరసారావుపేట నుంచి వచ్చేవాళ్ళు చిన్న మంచాలు తెచ్చుకున్నారు. ఏమో రెండు మెతుకులు తిని ఆ వంట శాల దగ్గరే పండుకోవచ్చు అని వారి ఆశ.

ఇక్కడ గోపాలంగారు ప్రయత్నాలు ప్రళయంగా

జేశాడు. రైతులు తలాబస్తావడ్లు కళ్లాలలోనే కొల్చారు. అవన్ని తెనాలిలో ఫ్యాక్టరీకి పంపి బియ్యం జేయించాడు. కొంతమంది తలచెడ్డస్త్రీలు ఆయనకు సహాయం చేయటానికి పదిరోజులు ముందుగానే వచ్చారు. పేలపిండి వేరేకొట్టారు. అటుకులు అదివరకే తయారయినయి. డబ్బులేక నానావస్థా పడుతూ యింట్లో "రేపటికి బియ్యంలేవు" అనుకొనే గోపా లం యిల్లు యిప్పుడు ఎలాగున్నదో వర్ణించటానికి వీలు లేదు. ఎవరింట్లో అన్ని పప్పుబస్తాలుంటయి. పంచదార బస్తాలు ఎవరింట్లో మనం చూస్తాము. వక్కలు కొబ్బరి కాయలు వాళ్ళింట్లో దొర్లుతున్నాయి.

రైతులుఅంతా తలోచెయ్యి వేసుకొంటే యజ్ఞశాల తయారయింది. ఎక్కడెక్కడివాళ్ళు వస్తున్నారు. తెనాలి స్టేషనులో దిగి ఆవూరు రావాలి. గుర్రంబళ్లు వంటెద్దు బండ్లు ఎడాతెరిపిలేకుండా నడుస్తున్నవి.

సప్తాహం మొదలెట్టకముందే గోపాలం భార్యకు పులి చేరునాను, కంటె, చేయించాడు. ఎవరో, ఒకయ్య 'భార్యకు దేవుడి సొమ్ములోనుంచి నగలు చేయిస్తున్నావట, అంటే, దొంగతనమా ఏమిటి పవిత్రమైన కార్యంలో పీటల మీద కూర్చునేటప్పుడు మెడలో పచ్చని సొమ్మేదైన లేకపోతే యజ్ఞం భగ్నమైపోదయ్యా!, అన్నాడు. అంతా

నిజమే అనుకొన్నారు. శాస్త్రంలో అల్లాఉందేమో ఎవరికి తెలుస్తుంది.

సప్తాహం రోజున గోపాలం గోపాలం భార్య పీటల మీద కూర్చున్నారు. భార్య మెడలో నానుకంటె ధగధగ మెరుస్తున్నాయి. "పార్వతీదేవిలాగ ఉందమ్మా" అన్నది ఆమె "నేను అల్లాగేఉంటా నాలుగు పెట్టుకొంటె" అని గుని సింది ఆమె కూతురు.

4

సప్తాహం జరుగుతున్నది. రోజు బండ్లు దిగుతున్నవి. పాకలు వేరే వేయించారు. ఏరోజుకారోజు ఫ్యాక్టరీనుంచి బియ్యం దిగుతున్నాయి, భక్తులు ఖర్చు భరించుకుంటున్నారు.

సరిగా రెండు ఝాములకు గోపాలదాసుగారు పంగ నామాలుదిద్ది సప్తాహానికై కొన్న బరంపురం పట్టుతాప్తాజరీ కనబడేట్టు కుచ్చెళ్లుబోసి కట్టుకొని వెండిపళ్ళెం చేతబట్టుకొని మరో బరంపురం తాప్తాపైన వేసుకొని నృత్యము జేస్తూ వీథులవెంట తిరుగుతారు. భక్తులు వెనుకనే మృదంగాది వాద్యములతో నడుస్తారు.

అట్టి సమయంలో ఆయనను జూస్తే సాక్షాత్తు శ్రీకృష్ణ భగవానులు జ్ఞప్తికి వస్తారు. భక్తిచే ఆయన తన్మ యత్వం పొందుతాడంటారు. వెండిపళ్ళెం చేతిలోనుంచి మటుకుజారదు. వీధిలోకి అంతా చూట్టానికి వస్తారు.

ముసలమ్మలు కన్నీళ్ళు పెట్టుకొని, "నాయనా"

నాయనా నా చిన్నికృష్ణ; కృష్ణుడమ్మ సాక్షాత్తు కృష్ణుడే" అంటారు. కొంతమంది బియ్యం యిస్తారు. కొందరు వెండి పళ్ళెంలో రూపాయలు కాసులు వేస్తారు.

ఒకాయన నా దగ్గరకువచ్చి "బాబూ ఈ గోపాల దాసు మళ్ళీ ఆ నారదస్వరూపం సుమండీ. కారణపురుషుడు. దీక్షాకంకణం కట్టుకొన్ననాళ్ళు భోం చెయ్యడట" "అవును భోం చెయ్యడండి ఏదో పూటకు శేరుపాలు కొబ్బరిముక్కలు బత్తాయికాయలుతిని ఉంటాడట" అన్నా.

"మరేనండి మన మొక్కగంట భోజనం ఆలస్యం అయితే గిలగిల లాడుతాము. మహిమసుమండీ. ఆయనకు పంచముఖాంజనేయులు ప్రత్యక్ష్యం కూడానుట" "మహిమ అంటారా! కావచ్చు, తొట్టిస్నానంకూడా చేయిస్తే తీరిపోతుంది" అన్నా.

దగ్గరలో హైస్కూలు విద్యార్థులంతా హోటలులో ఏడురోజులు రాము అని చెప్పారు. నాగాలువల్ల వచ్చే డబ్బు ఎందుకైనా వస్తుంది గోపాలంగారు చల్దిఅన్నాలకు కూడా ఏర్పాటు చేశారు. విద్యార్థులు రావటంవల్ల యజ్ఞశాల కళకళలాడింది. కొంతమంది వడ్డన అందుకొన్నారు. మరికొందరు భోం చేస్తున్న వాళ్ళకు ఉల్లాసము నిమిత్తం

శ్రావ్యంగా పాడారు. ఆడవాళ్ళ పంక్తికి ప్రత్యేకంగా విద్యార్థులు వడ్డించారు. ఒకడన్నాడు "అరే! ఆ మూల మిలిన్‌సుడబ్బా మీది బొమ్మలాగుందిరా ఒకతె" "సరే. కొంచెం కనిపెట్టి వడ్డించు" అన్నాడు అతని స్నేహితుడు నరసారావుపేటవాళ్ళు సప్తాహం కోలాహలంగా జరిగింది అన్నారు. చాటగొట్టిందాక ఉండి వెళ్ళిపోయినారు.

అంతా అయిపోయిన తరువాత ఒకరోజు గోపాలం భార్య అన్నది. "కాసులపేరు బంగారపువడ్డాణం కూడా చేయిస్తే తీరిపోయేది గదా," "తొందరపడతావేమి, వెట్టి బాగులదానా! అప్పుతీరి రెండు మూడువందలు చేతులో పడ్డయ్యా. సప్తాహం కాంగా రెండేండ్లకు సరిపోయే గ్రాసం కూడా యింట్లోఉంది. ఇంతలో రెండో యజ్ఞానికి ప్రయత్నం జేస్తాను." "ఈ దఫా గట్టి కాసులపేరు వడ్డాణం మురుగులు పోచీలు చేయించకపోతేనే నూరుకోరు."

"దై వేచ్చ ఎల్లాగుందోలే."

# ఒక రోజు

ఆరోజు ఇంటికివచ్చే సరికి ఇల్లు ఇల్లుగా లేకనరకంలోఉంది. కాంతం ముఖం మాడ్చుకొని ఒకమూల కూర్చొని ఉంది. బట్టలు ఉతక లేదు. పీటలు కడగలేదు. ఇల్లు ఊడవ లేదు. ఎక్కడి వక్కడ ఒదిలే వేసింది. ఇల్లు యీ రకంగా ఉండటం కాంతం ముఖలక్షణాలు అదో విధంగా మారటం చూచి తుపాను రాబోతున్నదని గ్రహించాను. కదిలిస్తే రేగుతుందని మెదలకుండా గదిలోని కెళ్ళి పుస్తకం తెరచి ముందరవేసుకొని కూర్చొన్నాను.

అంతకుముందురాత్రి కాంతానికినాకు ఇంగ్లీషుపాఠం చెప్పే విషయంలో పోట్లాటవచ్చింది. స్కూలులో ఎల్లా వున్న ఇంటివద్ద భార్య అయినా పాఠం సరిగా వినవొద్దూ నేను పాఠం చెబుతుంటే పులుసులో కారం వేసొస్తానని పచ్చడిమీద మూతపెట్టి వస్తానని వెడుతుంటుంది. నాకు కోయిను మెడవద్ద పట్టుకుని నడుముకు అరచెయ్యి పోటీ పెట్టి కొంచెం కులుకుతూ నడవటం అలవాటు. ఆ అల వాటును కాంతం ఎల్లా వెక్కిరించిందో చూడండి!

ఆ పాఠంలో ఆ రోజు నా కర్మవశాత్తు టరన్‌కోటు అనే పదం వచ్చింది. దానికి అర్థం చెబుతూ దేశములో రెండు రాజకీయమైన కక్షలున్నపుడు ఒక కక్షలో కొంత కాలముండి తరువాత తన మతము మార్చుకొని మరోపక్షము చేరే టరన్‌కోటు అంటారు అని చెప్పాను.

ఆ మరునాడు రాత్రి టరన్‌కోటు అంటె ఏమిటి అని గానిని అడిగాను, నాకు తెలియదని అనవచ్చునా!

అల్లా లేచినుంచొని చిరునవ్వుతో ఆరంభించింది. ఏం చేస్తుందో అని నేనూ అల్లాగేచూస్తూ కూర్చున్నాను. కోటు Turning Collar దగ్గర పట్టుకొని నడుముమీద చెయ్యేసి కులుకుతూ నడిచి ఇల్లా నడచే వారిని టరన్ కోట్సు అంటారు అని విపరీతంగా నవ్వుతూ పాఠం వదిలేసి వెళ్ళి పోయింది, ఇంక నేనేమి పాఠం చెప్పేది. ఆ రోజునుంచి ఇంగ్లీషుపాఠం చెపటం మానేశాను.

అందుచేత ఏమైన కోపం వచ్చిందా అని ఆలోచిస్తుం డంగానే సన్నంగా కాంతం మొన్నకొన్న గొడుగు ఏది! అని అడిగింది. గొడుగు పోయిందని నోటితో ఎల్లా చెప్పేది చెప్పకపోతే యివ్వాళ కాకపోతే రేపు తెలుస్తుంది. ఏమైనా కానీమని పోయింది "అన్నాను"

పోయిందీ. నేనను కొంటునే వున్నా అయ్యయ్యో చకక్కదనాల గొడుగు పోయిందీ. మీ దగ్గర ఉండదు. పారే స్తారు తీసుకొని వెళ్ళవద్దు అంటే విన్నారు? పోనీ కొన్నారు. ఏదీ! అయ్యో ముచ్చటయిన గొడుగు కళ్ళముందు కన బడుతుంది. ఎక్కడ పారేశారు—ఎవరి ముఖాన పెట్టారో!

అయిదురూపాయల గొడుగు! రూపాయబెట్టి రెవిక కొందామంటె ప్రాణం ఒప్పదు. ఆ అయిదు రూపాయలు బెడితే పట్టు రెవిక వచ్చే దే! పదికాలాలపాటు తొడుక్కొనే దాన్ని. బియ్యంకొంటే పదిరోజులు సరిపొయ్యేవి! చింత పండు కొంటే ఆరునెల్లలు సరిపోయేది! రెండువీసల నెయ్యి

వచ్చేది? రెండువీసల నెయ్యి బూడిదలో పోసినట్లేగా! అబ్బ! తలుచుకొంటె గుండెలు బద్దలవుతవి. నేనేం సంసారం జేసేది. కిరసనాయిలు డబ్బా కొనేవాళ్ళం గదా. ఆ అయిదురూపాయలు పెట్టి— ఎందుకు లెండి అనుకోటం మొన్న మా తమ్ముడు బటాణీగింజలకు కానీ అడిగితే లేదన్నారు. ఈ అయిదురూపాయలకు ఎన్ని బటాణీలు వచ్చేవి! ఎన్ని రోజులు తినేవాడు!

అబ్బ ఏదెట్లా బోతే నేమి నా మట్టుకు నేను హాయిగా తిని కూర్చుందామంటే ఈ చాకిరీతో నా ప్రాణాలు తెగుతున్నవి. మోపెడుబట్టలు ఉతకాలె. ఇల్లంతా ఊడవవలె. ఏ మాత్రం మన్ను వదిలేసినా చెవులు సాగదీస్తారు. గోడలు తెల్లగా ఉంచాలి. పుస్తకాలన్ని దొంతర్లుగా బల్లమీద ఉండాలి. లాంతర్లు గ్లాసులు ఇవన్ని శుభ్రంగా ఉండాలి.

ఇంత పెద్ద యిల్లు ఎందుకు? ఇన్ని గదులెందుకు ఏదో రెండు గదుల యిల్లు పుచ్చుకొని పడి ఉందామంటే వినరూ.

తొమ్మిదిగంటలకు వంట కాకపోతే గొంతుమీద కూర్చుంటారు. స్కూలుకు వెళ్ళిపోయిన తరవాత అయినా నడుము వాలుద్దామంటే ఒంటిగంటకు తేనీళ్ళు ఎవరు తయారు జేస్తారు? ఆ తేనీళ్ళు తాగిపోయిన తరవాత సాయంత్రం పనులు తయారవుతవి. విశ్రాంతి ఏది?

ఒకరోజు ఆయనకు భార్యగాజేసి నన్ను భర్తను జేస్తే ఆ భగవంతుడు. అపుడు తెలుస్తుంది ఆయనకు;

అని ఏక దమ్మున ఉపన్యాసం యిచ్చింది. నేను అదంతా వింటూ ఊరుకొన్నాను. కోపం కొంత చల్లారిన తరవాత

కాంతం అల్లా అంటున్నావేమి? ఇల్లు జూస్తే యింత అసహ్యంగా ఉంచావు. నువ్వు అల్లాగ ఉన్నావు.

నే నీచాకిరీ చెయ్యలేను. గొడుగులు పారేస్తుంటే సంసారం చెయ్యటం కష్టమే అన్నది.

గొడుగులు ఎప్పుడూ పోతవా?

అవును. ఎప్పుడూ పోనిది యీ చాకిరి ఒక్కటే.

చాకిరి నీకు ఎల్లా తప్పుతుంది?

నేనూ అదే ఆలోచిస్తున్నాను. నన్నేమి చేయ మంటారు. జీవితం భారం అనిపిస్తున్నది అన్నది కాంతం.

ఇంత సామాన్యంగా పోయిందానికి నాలో నేను సంతోషించాను. ఏదో భార్య సంసారం భారం అనిపించి విసుక్కున్నంత మాత్రాన నేను పాటించనక్కరలేదను కొన్నాను. నా మాటేమిటి, సోక్రటీసు అంత వాడికి తప్పిందికాదు.

తెరచాటునుంచి ఉపన్యాసం; ఒకరోజు సోక్రటీసు ఇంటికి రావటంతోనే భార్య తిట్టడం ప్రారంభించినదట. అతను ఏమన్నా మాట్లాడక ఊరుకొన్నాడు. ఆమెకు చివ రకు ప్రాణం విసికి బెల్లంకొట్టిన రాయిలాగ మాట్లాడవేం అని చెంబెడునీళ్ళు ఎత్తి అతని నెత్తినిపోసింది. అతను చాలా

సంతోషించి ఆ ఉరుములకు మెరపులకు ఈ కాన్త వానేనా అనుకొన్నాడట.

నేనూ అల్లాగే అంతటితో బైట పడ్డందుకు సంతోషించి "కాంతం నేనో కబురుచెబుతా వింటావు. ఒకతమాషా జరిగింది. అదంతా నీ విషయమై" అన్నాను.

"ఏమిటి—" అన్నది కాంతం.

"నీ విషయమై ఒక కథ వ్రాశాను."

"ఏమని వ్రాశారు? ఇల్లు ఊడవదనా? లాంతర్లు శుభ్రంగా తుడవదనా? భర్తను గౌరవించదనా? కొంటెపిల్ల అని అల్లరిజంతువని గోల చేస్తుందని వ్రాసిఉంటారు. బాగా తిట్టాశా మీా కసి తీరేటట్లుగా? ఏమి వ్రాశారో చెప్పరేం.

"చెప్పమంటావా?—"

చెప్పమంటావా అంటారేమి? చెప్పి వేశెయ్యండి. ఉన్నది ఉన్నట్లు పలకండి. నా తప్పులు పట్టుకోటం నన్ను తిట్టడమేగా మీారు జేసేపని—నిజం చెప్పండి నేనేమాట చెప్పకముందే అనవలసిన మాట లన్ని అనివేస్తుంటివి విను. ఆ కథలో కాంతం అంత మంచిభార్య, సుగుణవతి, ప్రేయసి, ప్రపంచంలోలేదని వ్రాశాను అని, చెప్పవద్దూ చేసిన పాపం?...ఆ పళంగా ఆమెను చెక్కిలిపైని ఒక్క చిన్నిముద్దు పెట్టుకొన్నాను. సిగ్గు వచ్చింది నాకు కూడా వెంటనే అక్కడ నిలవకుండా నా గదిలోకి వెళ్ళిపోయినాను.

## 2

పదకొండుగంటలు కొట్టటంతోనే పట్టుబట్ట కట్టుకొని భోజ నానికి తయ్యారయినాను. ఇల్లు స్వర్గతుల్యంగా ఉంది. కాంతం ముఖం కార్తిక జ్యోత్స్నలను వెదజల్లుతున్నది. దుఃఖమేఘములు పటాపంచలై పోయినవి, చెంబులు తెల్లబడి వెండిచెంబులులాగ మెరుస్తున్నవి. బట్టలు పువ్వుల్లాగ ఉతికి పెట్టింది. పీటలు కడిగింది, ఇల్లు అద్దంలాగ ఉంది, పుస్త కాలు చక్కగా బొత్తులుపెట్టి ఉన్నవి. ఎంతలో ఎంత మార్పు జరిగిందా అని ఆశ్చర్యంవేసింది, దేవతాసహాయం వల్ల జరిగిందా ఇదంతా లేక మాయా అని అనిపించింది. ఈ పని అంతా గంటలో జరిగింది. పైగా వంట ఆ రోజు చక్కగా చేసింది. కూరలు అవీ చాలా కమ్మగా ఉన్నవి.

ముకుళితకుసుమము వాయుచుంబనంచేత వికసించింది. చిరుకెరటాలను మలయపవనుడు ముద్దెట్టుకొంటే సంతో షంతో ఎగురుచున్నవి, వసంతునిచే ముద్దిడబడి పుష్పచయ మంతా వికసిస్తున్నవి. ఈ చంద్రకాంతాన్ని ఏది వికసింప జేసింది? అని నా ప్రశ్న.

# కొత్త ఎత్తు

చంద్రశేఖరం - ఒరే- చంద్రం.

ఏమిటోయి ఏమిటి యిల్లావచ్చావు?

నీకేమయినా బాకీరా నేను?

ఎబ్బే, ఏమి బాకీలేదే? ఎందుకు అల్లా అడిగావు? పాత బాకీలన్నీ తీర్చేస్తున్నావా ఏమిట్రా.

ఎబ్బే! లేదురా. నేను ఎవరెవరి దగ్గర ఏమి పుచ్చుకొన్నానో? ఏమి జ్ఞాపకంలేదు. నేను యిదివరలో పుచ్చుకొనని వాళ్ళెవరైనాఉంటే వాళ్ళదగ్గర ఏమైనా పుచ్చుకొందామని వచ్చా. నీ దగ్గర రెండురూపాయలు ఉంటే యిస్తూ అన్నాడు.

చంద్రశేఖరానికి నవ్వు వచ్చింది. అతను హేమసుందరానికి అప్పు యిచ్చాడో లేదో తెలియదు. కాని అతని ద్వారా హేమసుందరం జీవితకథ తెలిసింది.

అసలు సుందరం మంచి కుటుంబంలో పుట్టినవాడేట. పాఠశాలాంతర పరీక్షకు వెళ్ళకముందే తలిదండ్రులు కాలం చేశారు. యావదాస్తికి ఇతడొక్కడే వారసుడైనాడు. తన చిత్తం వచ్చిన రీతిని ఆస్తిని వ్యయపరచటం మొదలెట్టాడు. కొద్దిరోజులలోనే పిత్రార్జితమైన ఆస్తి యావత్తు విక్రయించాడు. ఆ సొమ్ము ఎట్లా ఖర్చుఅయిందో ఎవరికీ తెలియదు.

కాని అచిరకాలంలో ఆ సొమ్ము యీతని చేతులలో

నుంచి జారిపోయింది.

తల్లిదండ్రులు చనిపోయిన దగ్గరనుంచి హేమసుంద రం ఒహరిక్రింద నౌకరికి ప్రయత్నించక స్వచ్ఛందవృత్తి అవలంబించాడు. ఎప్పుడూ తెల్లని బట్టలు వేసుకొంటాడు. ముప్ఫై నలభై రూపాయలు తక్కువ కిమ్మత్తు చేసే కోటు అతను వేసుకోనగా మనము చూడము.

త్రికాలములయందు తేనీరును త్రాగడం హేమసుంద రానికి అలవాటయింది. జట్కా-బండివాళ్ళు అతనిని బలవంత పెట్టి ఎక్కించుకొంటారు, డబ్బు ఖర్చు చేయడంలో అతను కొన్ని క్రొత్తమార్గాలు కనిపెట్టాడని నేను చెప్పగలను,

అతను తార్కికుడు. దృఢమైన కాయముంటేనే కాని నిర్మలమైన మనస్సు, ఉండదని వాదిస్తాడు. నిర్మలమైన మనస్సు, పరిశుద్ధాత్మ ముక్తికి సాధనాలు. అయితే దృఢ కాయాన్ని పెంచాలంటె ధాటీయైన భోజనం అత్యవసరం.

అయితే అతను తనముక్తికొఱకే పాటుపటుతున్నాడు' కాబట్టి స్వలాభిలాషి అంటారేమో. ప్రతివాడును ముక్తిని ఇల్లా సాధించాలన్న సంగతి అందరికీ తెలియజేస్తున్నాడు కాబట్టి దేశభక్తుడుకూడాను.

అతను భోజనప్రియుడా! ఆ మాట ఎల్లా అనగలము? భోజనమును భోజనముకొఱకే ప్రేమించడు. అది ముక్తి సాధన క్రియగా ప్రేమిస్తాడు. అందుకనే ఆ బ్రాహ్మణుడు విస్తరివద్దకు వచ్చి "ఇంకా కొంచెం బంగాళాదుంపలకూర వడ్డించనాండి" అంటే "వడ్డించుకో" అంటాడు. "వడ్డిం

చుకో" అంటంలో అతనికి భోజనమునందుండే విరక్తి భావం తేటపడుతున్నది,

"వడ్డించుకో! నాకొఱకు కాదు సుమా? నీ కొఱకే! నీ ముక్తి సాధనకొఱకే నీ అంతరాత్మకొరకు ఇలా వడ్డించుకో, అనే భావం ఆ మాటలలో ధ్వనిస్తున్నది, నీకు వేస్తే నాకు ఎట్లా వస్తుందయ్యా అంటే సమాధానమిది. నేను తిని పరిశుద్ధాత్మతో ముక్తి పొందుతాను. నా మోక్ష ప్రాప్తికి నీవు కారణభూతుడవు అయినావు కాబట్టి నీకు పుణ్యం వస్తుంది-కాబట్టి యింకా కొంచెం వడ్డించుకో.

తిండిలోనేగాక ప్రతి విషయంలోను హేమసుంద రానిది వేదాంతమార్గమే. కాఫీ హోటలుకు ఇద్దరు స్నేహితులతో కలసివెళ్ళాడు. అంతాకలసి తిన్నారు. డబ్బు సుందరం చెల్లించనన్నాడు, వారిద్దరిలో ఒకరు చెల్లించక తప్పిందికాదు. ఏమిరా సుందరం డబ్బు లేకుండా కాఫీ హోటలుకు ఎల్లా వచ్చావురా అంటే ఓరి వెర్రివాడా ethicalగా ఆలోచిస్తే తినేది ఎవరు? తినేపించేవా డెవడు? అంతా ఒకటికాదా.

"తిననేర్చు వాడనేనట
తినిపించువాడు రామభద్రుండట"

నేను నీవు అనే రెండువ్యక్తులు ఏడిచినవా? నేనెవరు వాడెవడు? నాలో వెలుగుతున్న ఆ కళంకమైనటువంటి దేదీప్యమానమైన జ్యోతి అతనిలో వెలగడంలేదా! సూర్యుడు అన్ని ఘటాలలోను వెలుగుతూ ఇన్ని సూర్యులుగా మన నేత్రద్వయానికి కనిపించినట్లు ప్రతిమానవుడు

ఇది నాది అనేటటువంటి అజ్ఞానాంధకారంలో పడిపోయి ద్వయితంలోకి దిగుతున్నాడోయి అని లెక్చెరు కొట్టాడు.

అందుకని అతను అప్పు పుచ్చుకొని తిరిగి యివ్వవలసిన బాధ్యతలేదని కొన్ని అప్పులు యివ్వలేదు. అంతగా అడిగితే ఇస్తానులే అంటాడు. ఎక్కడినుంచి తెచ్చియిస్తాడు? మరొకరిని అడిగి యితనికి తీరుస్తాడు. ఆ ఇంకో అతను అడిగినా అంతే! అంటే అర్థశాస్త్రసూత్రం వొకటి యిక్కడ ప్రయోగిస్తే ఉన్న చిక్కు విడిపోతుంది. డబ్బు అనేది దేశందాటి వెళ్ళితే దేశానికి నష్టం. దేశంలో డబ్బు దేశంలోఉంటే దేశం బాగుపడుతుంది. ఇతర దేశాలనుంచి వస్తే మరీ మంచిది. అప్పు తీసికొని యివ్వకపోవడంలోవచ్చే నష్టం ఏమిటి? ఏమిలేదు. దేశంలో సొమ్ము దేశంలోఉంది, చేతులు మారినాయి. కాని దేశం మారలేదు. ఎవరి దగ్గర ఉంటేనేమి? అంతా ఒకటే. కాబట్టి బాగా ఆలోచిస్తే ఆ విషయం అంత విచారణీయంగాదు.

అయితే అప్పులు ఎవరిస్తారు అనేది పెద్దచిక్కుకాదు? ఎందుకివ్వరు? ఇవ్వకపోతే తనకున్న ఆస్తి తాకట్టు పెడతాడు. ఇల్లు, పొలము, చరాస్థి స్థిరాస్థులు అన్నీ తాకట్టులో ఉన్నయి. ఇంక ఏమి తాకట్టుపెడతాడు? అంటారేమో ఒకరికి తెలియకుండా మరొకరికి ఆ వస్తువునే ఆ ఇల్లునే ఆ పొలాన్నే తాకట్టు పెట్టాడు వీలయినంతవరకు. ఇంక తాకట్లకు వీలులేదు. అయితే మానె నమ్మకంమీద కొన్ని, ఇంకొకరు జామీనుఉండి యిప్పించినవి కొన్ని, తాకట్టు అప్పులు తనఖా అప్పులు చేబదుళ్ళు, స్నేహితుల అప్పులు

రేపు యిచ్చే అప్పులు, సాయంత్రం అప్పులు, యిల్లా అన్ని అప్పులు, అప్పులు అయిపోయినవి. లోకం అంతా అప్పుల వాళ్ళే. ఇంకొకరు అయితే అప్పులు తీర్చలేకపోయేవాళ్ళే; అదిగాక దిగులుపడి క్షీణించిపొయ్యేవాళ్ళే? ఇతనికి దిగులే లేదు. మహాజ్ఞానికి ఆ భేదంలేదు.

అయితే హేమసుందరానికి భుక్తి జరిగింది కాదు. అప్పులు యింక ఎవ్వరు యివ్వలేదు. స్నేహితులు కూడా యితనిని జూచి అసహ్యించుకొన్నారు. కొందరు తిట్టారు. కొందరు దుర్భాషలాడారు. అనరాని మాటలు కూడా అన్నారు.

ఇంకొకడు "తలెత్తుకొని తిరగటానికి వీలులేని స్థితికి వచ్చింది" అన్నాడు. సుందరం ఏమన్నాడు? పోరా, యివన్ని లెక్కా జమా? మహాజ్ఞానులకు యివి లెక్కా! లోకంలో అనేకమంది అనేక విధాలగా అంటారు. వారి మాటలు లెక్కేమిటి? "పలుకుచుందురు పలువురు పలు విధాల, వారి మాటలు గాలికి పారిపోవు" అని మహాకవి అన్నాడు.

ఈ తనువు శాశ్వతమా............

చిత్తాస్వాతులు రెండు సంధింప ముత్తేపు
చిప్పలోపడ్డాది చినుకొక్కటి
ముత్యమై నీళ్ళలో మునిగిపోయేనాడు
చిప్పతో ఏమైన చెప్పిపోయిందా.

ఎప్పుడు రాలిపోతుందో. ఈ ఉన్న మూడురోజుల్లో "ఇది నాది" ఏమిట్రా! "నేను అనే అహంభావం పెంచుకొని

తగవులు తెచ్చుకొంటారు. "తాను తానని తన్నకలాడ్తది యీ దేహం" అని సమాధానం చెప్పుకొనేవాడు.

## 14

కాని ప్రపంచకంలో తిండిలేనిది వెళ్ళదు. ఇంత తిండి యీ జీవికివేస్తే యీ జగమనే నాటకరంగంలో కొంతసేపు నటన చేస్తుంది ఇతనికి తిండి దొరికిందికాదు. మరి మోక్షసాధనకా తిండి మనవాడికి. అదిగాక అప్పులవాళ్ళ బాధ ఎక్కువయింది. ఆ విషయం పరలోకప్రాప్తి కేమి ఆటంకం కలిగించకపోయినా ఈ లోకంలో మట్టుకు కంటకంగా ఉంది.

అందుచేత అతను అన్నంమాని యేదో ఫలహారం చెయ్యటం ప్రారంభించాడు. అదిగాక భగవద్గీతకూడ ఒకటి కొని పారాయణ ఆరంభించాడు. కాని గీతాపారాయణ ఋణ బాధా నివారణకై ప్రయోజనపడలేదు. ఈ బాధ తీర్చుకోవాలని నిశ్చయించుకొని ఈ క్రింది విధంగా "దేశసేవలో" ప్రకటించాడు.

"సి. సుందరరావుగారు లోకుల బాకీలన్నీ తీర్చడానికి నిశ్చయించుకొన్నారు. సెప్టెంబరు 15 వ తారీకున అందరికి బాకీలు తీరుస్తారు కాబట్టి ఆ రోజుకు లెక్క తయారుజేసుకొని వారింటికి రావలసినదని బాకీదార్లను ప్రార్థిస్తున్నారు."

ఇది జూచి వర్తకులు మరి తదితరులు చాలా సంతోషించారు. తాము అనుకొన్నంత చెడ్డవాడు కాడు అని తోచింది. పాపం యిన్నిరోజులనుంచి ఏదో యిబ్బందుల వల్ల తీర్చలేదు. రేపు తీర్చేస్తాడు అన్నారు. లెక్కలు జూచుకొన్నారు. సిద్ధంగా రూపాయలణాలుతో పద్దులు

తయారయినవి. పదిహేనో సెప్టెంబరు కోసం యెదురు చూస్తున్నారు.

సుందరానికి రోజురోజుకి భక్తి ఎక్కువయింది. ఆ సంగతి నందరికి తెలిసింది - అంతా "పూర్వం మోస్తరు గాదు. సుందరం ఇప్పుడు చాలా దైవభీతిగలవాడైనాడు. గీతాపారాయణంగూడా చేస్తున్నాడు. ఇక మనకు బాకీ తీర్చడమే గాకుండ ముందు పవిత్రమైన జీవనంలోకి దిగుతాడు" అన్నారు.

పద్నాలుగో సెప్టెంబరు వచ్చింది. రేపు బాకీలు సుందరం తీరుస్తాడు. సాయంత్రం ఎప్పటిమోస్తరుగానే వచ్చింది. రాత్రి గడచి తెల్లవారింది. కాని ఆ రోజున సుందరంగారు ఆకస్మికంగా పరలోక గతులైనారని పుకారు పుట్టింది. వర్తకులు, బాకీదార్లు పద్దులతో వచ్చారు. కాని సుందరం శవం యింటిముందు, వాళ్ళకు కనిపించింది. ఎంత చెడ్డవాడైనా చనిపోయిన తరువాత "అయ్యోపాపం" అనక మానరు. బదికుంటె వాడైనా బాకీలు ఎల్లాతీర్చువాడో? కొంతమంది "ఈ వెధవ బాకీ తీర్చకుండా చచ్చిపోయినా" డని తిట్టారు. కొందరు అనరానిమాటలు అన్నారు. ఏమంటె నేమి ఆయన స్వర్గానికి దారిపట్టాడు. ఈ మాటలాయనకు వినపడవు,

మహారణ్యంలోకూడా ఫలవృక్షాలుంటవి. ఎడారిలోకూడా జలాశయములుంటవి. దుర్మార్గులలోకూడా మంచివాళ్ళుంటారు కొందరు. "ఏదో అయిపోయింది. ఆయనకు ఆస్తి ఏమీలేదు. మనం చేసేది ఏమిలేదు. అప్పులుఉన్నవి

అని మనం అనుకుంటిమా అంటే, ఆయన మళ్ళీ మన యిళ్ళల్లో ఆయువులేని బిడ్డగానో కుక్కగానో జన్మమెత్తి తీర్చుకోవాలి.అల్లాశాస్త్రాలు ఘోషిస్తున్నాయి. ఎందుకొచ్చిన పీకులాట! పాపం ఆయనను బంధవిముక్తుణ్ణిగాజేద్దాము. అప్పుడు ఆయన నిరాటంకంగా మోక్షానికి తోవబడతాడు. లేకపోతే యమభటులు అతనితో "ఏమోయి నీకు అప్పులున్నాయి మళ్ళీ జన్మాలెత్తాలి నరకానికి నడు" అంటారు కాబట్టి మనం అంతా కలిసి ఆయనను ఋణబంధవిముక్తుణ్ణి చేసి పుణ్యం గట్టుకుందాము. బ్రాహ్మడికి యింత భోజనం పెడితే పుణ్యం. మోక్షం యిప్పిస్తే. యిక చెప్పనక్కర లేదు" అన్నారు. అంతా నిజమే అన్నారు. చేసేది లేకపోవటం చేత బాకీదార్లు వుట్టినే పుణ్యం వస్తుంటే పోగొట్టుకోటం ఎందుకని సరే అన్నారు. అంటే ఎల్లాగ చేసేది? ఏమిలేదు, అల్లా బంధవిముక్తుణ్ణిజేస్తే ఆయనకు మోక్షప్రాప్తి అవుతుంది. వీళ్ళకు పుణ్యం వస్తున్నది. సరే అంటే సరే అన్నారు.

బ్రాహ్మణులు శవాన్ని పాడిపైన విరిచి కడుతున్నారు. కొత్తకుండ తెచ్చారు. మూకుట్లో నిప్పు తయారయింది. దర్భలు మొదలైన పరికరాలతో బ్రాహ్మలు తయారయినారు.

వర్తకులు తమ పద్దు పుస్తకములుతీసి ఆయన పేజీలో ఆయన పేరుఉన్న పద్దు అంతా కొట్టివేశారు పాపం. బ్రాహ్మణునికి మోక్షానికి దారి తెరిచి అయింది.

బ్రాహ్మణుల మంత్రం ప్రారంభించారు. నలుగురు

బ్రాహ్మణులునాలుగుకొమ్మలుపట్టుకొనిశవాన్నిపై కెత్తారు. ఇంట్లో వాళ్ళంతా ఒకపెట్టున ఏడ్చారు. గుమ్మందాటి బజారులోకి వెళ్ళారు. ఇంట్లోవాళ్ళు లోపలికి పోయినారు ఏడుస్తూ.

శవాన్ని తీసుకొని నడుస్తున్నారు. ముందు కర్మజేసే ఆయన నిప్పట్టుకొని, వెనకాల, వర్తకులు యితరులు నడుస్తుగ్నారు, చూచిన వాళ్ళంతా పాపం పోయినాడన్నారు, నాలుగు బజార్లు కలిసే చౌకు దగ్గరకువచ్చిన తరువాత ఎవరి దారిన వాళ్ళు యింటికి వెడదామనుకొంటున్నారు, ఇంతలో "దింపండి? "దింపండి" అని కేకలు వినపడ్డయి. శవాన్ని దింపారు! మెల్లగా కట్లు విప్పారు. ఆయన మెల్లగాలేచి కూర్చున్నాడు. "బ్రతికాడు" బ్రతికాడని, అంతా కేక లేశారు.

అతనుకూడా "బ్రతికానురా బాబూ" అప్పాలన్నీ తీరినయా ఇంకా ఉన్నయ్యాఅన్నాడు "అప్పాలన్నీ తీరినయి యెవరికిబాకీలేవు" అని ఎవరో కుర్రవాడు కేకేశాడు,

బతికానురా నాయినా అని అతనుకూడా లేచాడు. దారిలో ఎవరో కనబడి ఏమిరో ఎవరో చచ్చావన్నారే నీవు అన్నారు. ఎచ్చే లేదురా. ఏదో అప్పాలబాధ పడలేక అదో ఎత్తు ఎత్తానన్నాడు.

# ప్రయాణం

వీధిబడి పంతులు నిర్దయగా కొట్టాడని ఆ దుర్మార్గుడి బడికి నాన్నగారు పోవద్దన్నారు. గుంటూరు పంపి చదువు చెప్పించటానికి నిశ్చయమయింది. బడి ఆ వూళ్ళో తెరిచారు. కాని మాకు బయలు దేరటానికి మంచిరోజు కుదరలేదు. ఒకమాటు బయలుదేర బోతుంటే తుమ్మారు. ఆ తుమ్మిన మనిషిని తల వాచేటట్లు చీవాట్లుపెట్టింది మా అమ్మా! మళ్ళీ చాలా రోజులు మంచిరోజు కుదిరింది కాదు. కుదిరినా శకునం బాగుండక అనేకసార్లు ప్రయాణం ఆపేశాము.

తుదకు తదియ సోమవారము.

ప్రయాణం నిశ్చయపరిచారు. తూర్పు విద్యాలాభం అనికూడా ఉంది, దివ్యమైన గ్రహసంపత్తి ఉండటంవల్ల ప్రయాణ ప్రయత్నాలు తీవ్రంగా జరిగినవి.

మా అమ్మకు ఆ రోజల్లా కండ్లనిండా నీళ్ళు, కాని ఆమె దుఃఖాన్ని దిగమింగి నాకు ధైర్యంచెప్పింది.

నాకు లోపల అమ్మను నాన్నను వదలి వెళ్ళటం దుఃఖంగా ఉన్నా పై కిమటుకు విచారాన్ని కనపడనీయక ధైర్యంగా రొమ్ము విరుచుకొని తిరిగాను.

ఆ రోజు మా అమ్మా నేను కలిసి భోజనముందు కూర్చున్నాము. అదే ఆఖరుసారి ఆమెతోకలిసి సుఖంగా మాట్లాడినది.

నేను మళ్ళీ వచ్చేసరికి మా అమ్మ కాలం చేసింది. ఏ రోజైన చీకటి పడేవేళకు యింటికి రాకపోతే తల్లడిల్లి

పోయేది. ఇప్పుడు నన్ను ఒక్కసారి అయినా యిన్ని సంవత్సరాలు ఉన్నది. కొంచెం లఘువుగా భోంచేస్తే ఏమి తినలేదని భ్రమపడేది! గేదె ఈనితే పిల్లలు దగ్గరలేరని విచారపడేతల్లి నాకు దూరమైపోయి ఇరవైయేండ్లుఅయింది! ఆమె మరణశయ్యలో ఉన్నప్పుడు నేను అజ్ఞానంలో ఉన్నాను, మా చెల్లెలు పూలతో ఆడుకొంటున్నది మమ్మి నిద్దరిని చూస్తూ ఆమె ప్రాణం విడిచింది.

సరే ఆమెచావు ముందుగా చెప్పాలిసిందికాదు. ఎప్పుడో చెప్పాలిసిన విషయం యిప్పుడే చెప్పేశాను. అందుచేత మళ్ళా వెనక్కిపోవాలి. ఆ రోజు మా అమ్మ నన్ను వదల లేక వదలలేక వదిలింది.

ఒకమాటు పొరుగూరుపంపి ఒక్కగాని ఒక్క పిల్ల వాడికి చదువు చెప్పించకపోతే ఏమి అనుకొనేది. మరోమారు నా పురోభివృద్ధిని ఆలోచించివదిలి ఉండటానికి నిశ్చయించు కొనేది. అదే వదలటం మళ్ళీ కలుసుకోలేదు.

నేను పొరుగూరు వెడతానని మా నాన్న తియ్యని పెరుగు తెచ్చాడు. మా అమ్మ చక్కెరాలుచేసి పెట్టింది. రాముడిచే దొడ్లో వేపపుల్లలు కోయించి పెట్టింది. నేనదే ఆఖరుసారి మా అమ్మ ప్రేమను అనుభవించటం!

రేపు ప్రయాణం అనేసరికి గుండెలు కొట్టుకొన్నాయి నాకు. ఏ విధానయినా ప్రయాణం ఆగిపోతే బాగుంటుందను కొన్నాను. ఆటంకాలు ఏమీ రాలేదు. కాని నా హృద యంలో ఒకమూల పొరుగూరు వెళ్ళి కొత్తస్నేహితులను,

వింతవస్తువులను చూద్దామని ఉంది. పెట్టె సద్దుకొంటానికి కూర్చున్నాను.

ఇంతలో రాముడొచ్చి నాగాయ పెండ్లాము ఉతక లేదటండీ. బట్టలు రేపు తెస్తానన్నాడని కబురొచ్చింది" అని అన్నాడు. వళ్ళు మండిపోయింది నాకు. వాడిభార్య అప్పుడే ఎందుకు నీళ్ళాడాలి? సమయం చూచి చూచి సరిగ్గా నేను వూరు ప్రయాణం నిశ్చయించుకొన్నరోజునే; లేకపోతే ఇక దానికి మంచిరోజు దొరక్కపోయిందా? అని అనుకొన్నాను, అయిన అప్పట్లో నాకు మానవజీవిత రహస్యములు కొన్ని తెలిసినవి కావు. చాకళ్ళ భార్యలు మనం ప్రయాణం నిశ్చయించుకొన్న రోజునే నీళ్ళాడుతారు. స్కూలు తెరచిన రోజుననే విద్యార్థికి బంకవిరోచనములో తలనొప్పిజ్వరమో వస్తుంది. ఇదో రహస్యం లేకపోతే ఆ వారంలో వాడి తమ్ముడు, ఒడుగో, చెల్లెలు కార్యమో జరగకతప్పదు.

సరే దానికేమిటి, వాడు బట్టలు తేలేదు; నాన్నగారు స్వయంగా వెళ్ళినా ఎక్కువలాభం కనిపించలేదు. ఆఖరుకు పోలీసు వీరాస్వామిని పంపాము. వీరాస్వామి దుడ్డుకర్ర సమ్మోహనాస్త్రంలాగ పని చేసింది. చాకలి అప్పటికప్పుడు గుడ్డలు తయారుచేసి పంపాడు' శివుడు ఈ చాకళ్ళబాధ పడలేకనే గదా ఓ తోలుముక్క కప్పుకొని కాలం గడుపుతున్నాడు, అప్పటి కాలంలో పోలీసువాళ్ళు లేకపోవడం వల్ల లోపంగదా యిది!

తరువాత పెట్టె సద్దుకొన్నాను. ప్రయాణానికి సిద్ధపడ్డాను. ఇక తెల్లవారితే ప్రయాణం.

ఆ రాత్రి మా నాన్నకు నిద్రలేదట. ఆయన మనస్సు పరిపరివిధాల పోయింది. కుర్రవాడిని గ్రామాంతరం పంపటం ఆయనకు చాలా కష్టంగాఉంది. కాని తప్పని సరిగా పంపిస్తున్నాడు.

తహసీలుదారుగారిల్లు మా యింటికి పొరుగిల్లు. ఆయన భార్యకూ అమ్మకూ ఎంతో అంతస్నేహం. వాళ్ళ నౌకరు రాముడు చిన్నతనంలో నన్నెప్పుడు ఎత్తుకొనేవాడు. అంచేత వాళ్ళ అబ్బాయితోపాటు నేను గుంటూరులో చదువుకొనే ఏర్పాటులు జరిగినవి. నా ప్రయాణంకూడా స్టేషను దాకా వారి బండిలోనే. మా వూరుకు స్టేషను ఇరవై మైళ్ళు. వాళ్ళు బహుజాగ్రత్తగా నన్ను కాపాడుతారనే నమ్మకమే నన్ను పంపుటకు మా నాన్నను పురికొల్పింది!

తెల్లవారుఝామున నాలుగు గంటలకే ప్రయాణం. మా అమ్మ అంతకుపూర్వమే లేచి వేడినీళ్ళు పెట్టింది. తల దువ్వింది. అప్పుడు నాకు గిరిజాలుండేవి. అవి మార్చి ముందు జుట్టు పెట్టిన తరువాత మా అమ్మ నన్ను చూడలేదు. బొట్టు పెట్టింది. చెడ్డసహవాసం చెయ్యకేం బాగా చదువుకో నాయినా. నీవు పెద్దవాడవై బి. ఏ ప్యాసుజేసి సంపాదించి మమ్ములను సుఖపెట్టునాయినా అని అన్నది. దౌర్భాగ్యుడ్ని నాకా అవకాశం కలుగలేదు. ఆమె కండ్లనిండా నీరెట్టుకొంది. నా వళ్ళు కంపించిపోయింది. చప్పున ఏడ్చాను. ఏడుస్తూనే బండెక్కాను. అంతా నన్ను ఓదార్చారు.

మా నాన్న తెల్లవారిందాకా బండితో నడిచి తెల్లవారిన తరువాత దింపి మొగం కడిగించి, చద్దన్నం వాగు దగ్గర తినమని రైలులో కిటికీలోంచి తొంగిచూడక జనం మధ్య కూర్చోమని హితబోధచేసి పొంగివచ్చే దుఃఖాన్ని ఆపుకోలేక, "నేనుంటా"నని గిరుక్కున తిరిగాడు.

4

"ఇహ మాట్లాడలేకపోయినాడు"అని అన్నారు. "ఆయన దుఃఖం ఆపుకోలేకపోయినాడు కన్నకడుపాయె" అని అన్నది పిన్నిగారు. నాకు మళ్లా ఏడ్పొచ్చింది. ఆపళంగా దిగి పోదామని బుద్ధిపుట్టింది కాని ఏ కారణంచేతనో ఆగిపోయి నాను. సాయంత్రానికి స్టేషను చేరాము. రాముడు, నేను, పిన్నిగారు తహశ్శీలుదారుగారి అబ్బాయి ఆయననే నేను బాబయ్యగారు అంటాను. బాబయ్యగారు అక్కడ హోటలులో భోజనంచేసి పదిగంటల బండికి నిరీక్షిస్తున్నారు. ఆరు గంటలకే భోజనంచేసి రైలుకొరకు కూర్చున్నాము. పండు వెన్నెల కాస్తున్నది. ఆ వెన్నెలలో యిసుకతిప్పపైని కూర్చున్నాము. అదేమిటో నాకు ఆ వెన్నెల వికార పెట్టింది. అప్పుడే నేను బెంగపెట్టుకొన్నాను. రోజూ నేను ఆడుకొనివచ్చి వాకిట్లో మంచంపైని పడుకొనేవేళ అది. మా అమ్మాయి నా పక్కనే కూర్చొని మల్లెమొగ్గలు దండలు దండలుగా గుచ్చి ఇది నాన్నకు అది అన్నయ్యకు వేరుజేసి, మిగతాపూలు రెండు పెద్ద చెండ్లుగట్టి తాను అమ్మా తీసికొనేది. అప్పుడు అన్నంతినమని మా అమ్మ బలవంతపెట్టేది. అన్నం తినిన తరువాత నాన్నవచ్చి

మమ్ముల నిద్దరిని పక్కలో పెట్టుకొని వెన్నెలలో పడుకొని, నాకు ఆలిబాబా దొంగ కథ, పీరురాజు కథ, చెప్పేసమయం అట్టి సమయం గనుక నాకపు డేమాత్రం వెన్నెల సౌఖ్యం యివ్వలేదు. ఆపళంగా వెనక్కుతిరిగి వెళ్ళుదామా అని, ఎందుకొస్తినా అని, చదువు లేకపోతేనేమని పరిపరివిధాల మనస్సుపోయింది, విచారసముద్రములో మెల్లగా మునిగి పోయాను.

5

రాముడూ, రాముడూ, ఓరి వెధవా, అప్పుడే నిద్రోయినా వట్రా. ఈ డబ్బుచ్చుకొని గుంటూరుకు నాకు! బాబయ్యకు నాగేశానికి, టిక్కెట్టు కొనుక్కొనిరా అని బాబయ్య తల్లి చెప్పింది.

సిత్తంబాబు. ఎంతండి?

నాకు, బాబయ్యకు. 2 రూపాయలు. పిల్లవాడికి అర్థ టిక్కెట్టు.

వేరేరుగా తీసికోవాలండి?

అవునురా!

ఏమన్నా దగా ఉంటుందాండి. అందరికి ఒకటేధరా?

ఓరి సన్యాసి! బేరం వుండదు. ఎప్పుడు స్టేషనుకు వచ్చిన వెధవవుకావాయు. ఎప్పుడూవచ్చే సుబ్బులు యీ దభాజబ్బుచేసి రాలేదు. అని గొణుక్కొని పో వేగిరంపో. టిక్కెట్లుయిచ్చే కిటికీదగ్గరకువెళ్ళి అడిగిపుచ్చుకో యిస్తారు అన్నది.

ఏ వ్వూరండి అమ్మా? మరిపోయింది.

ఓరీ గుంటూరు గట్టిగా జ్ఞాపకంఉంచుకో.

సిత్తం. మరిచిపోవటమే.

అప్పటికి షుమారు తొమ్మిదయింది. గంటముందుగా లేవటానికి కారణం ఉంది, వాడు ఒట్టిజాగుమనిషి. స్టేషనులో నిలువునా నిల్చొని నిద్రపోగలడు. ఒకాయన ప్రొద్దున తొమ్మిదిగంటలకు నిద్ర మొఖంతో కునికిపాట్లు పడుతూ పళ్ళు తోముకుంటున్నాడు. ఎవరో స్నేహితుడువచ్చి.

ఏమోయి యింత ప్రొద్దోయి పళ్ళుతోముతున్నావు. నిద్ర చాలనట్లు కనిపిస్తుంది. ఏమిటి భోగట్టా అన్నాడు.

"నిజమేనోయి నిద్ర బొత్తిగా చాలిందికాదు. ప్రొద్దున అర్జంటు పనిమీద, ఎనిమిదిగంటల బండికి పంపాలని నన్ను మా వాళ్ళు, తెల్లవారుఝామున మూడుగంటలకే లేపారు అన్నాడు."

"అయ్యో అంతముందు లేపారేం? స్టేషను దగ్గరేకదా యింటికి అంత వేగిరం లేపితే నిద్రభంగంకాదు, అయితే మరి పోలేదేం" అన్నాడు.

ఆ పెద్దమనిషి యిటూఅటూ ఎవ్వరూ లేకుండా చూచి రైలు అందిందికాదోయి అన్నాడట.

అలాంటిమనిషి మా రాముడు. మేమెంత అనుకొన్నామో అంత అయింది. వీడు వెళ్ళేసరికి టిక్కెట్లుఇచ్చే కిటికీ యింకా తెరవలేదు. అంచేత వాడు అక్కడ అడ్డకర్ర మీద జారకిలబడి నిద్రపోయినాడు!

ఒక విద్యార్థి పరీక్షపత్రంచూచి అబ్బో మూడు గంటల కాలం యిచ్చాడు. ఈ వెధవపేపరు అరగంటలో

ఆసరు చేయలేనా? ఇప్పటినుంచీ ఎందుకు శ్రమ? ఒక్క అరగంట యిట్లా విశ్రమిద్దాం అని కునికి సాయంత్రం ఆరు గంటలకు తెల్లముఖంతో లేచి పై ఉత్తరీయం దులిపి పైన వేసుకొని యింటికెళ్ళాడట వెధవపరీక్ష పోతే పోయిందను కొని. అట్లాగే రాముడు నిద్ర లేచేసరికి టికు-టికు-న టికట్లు యిస్తున్నారు. రాముడికి వళ్ళు ఝల్లుమన్నది. గబగబా కిటికీవైపుకు తోసుకొని వెళ్ళాడు. అక్కడ అంతా అన్ని ఊళ్ళకు టికెట్లు కొంటున్నారు. ఇన్ని ఊళ్ళ పేర్లు వినేసరికి వాడి వూరిపేరు మరిచిపోయినాడు.

ఏం జేసేదానికీ తోచక మళ్ళీ బయటికివచ్చి తల గోక్కుంటూ కూర్చున్నాడు. తల యెంతబరికినా జ్ఞాపకం రాలేదు. తిరిగివెడితే బాబుగారు చావదంతారని భయపడి అక్కడనే శిలా స్తూపంలాగ నిలబడ్డాడు,

ఇంతలో టికెట్లు యివ్వటం అయిపోయింది. ఇంకె వ్వరైనా టికెట్లు కొంటరా" అని అతను అరిచాడు. రాముడి కాళ్ళు అప్రయత్నంగా అటుసాగినయి. అక్కడి కెళ్ళి టికెట్టు కావాలన్నాడు.

ఏ వూరు?

అదిగాదండి - అని రాముడు ఉపోద్ఘాతం మొదలు పెట్టాడు.

అదిగాదేమిటి ఊరిపేరు చెప్పవోయి?

చెపుతానండీ మరి ఆరు సదువుకొంటాని కెడుతున్నా

రండీఉమా బాబుగారు, తహాశీలుదారుగారి వదెనెగారు, మేస్టరుగారి అబ్బాయి.

అదేమిట్రా ఆ గొడవ. మీ వూళ్ళోవున్న మనుష్యులందరినీ ఏకరవెటుతున్నావు. ఎవరెవరు ఏమి పనిమీద వెడుతున్నది నాకెందుకురా.

నన్నేదో స్టేషనుదాకా రమ్మంటే నేనొచ్చానండీ. టికెట్లు గూడుమూసుంటె...

ఏమిరా సోది ఆ వూరుపేరు చెప్పు తెలియకపోతేపో.

ఎబ్బె! సోదికాదు సామి, నాతోడు! మొన్న మా వూరు కరణంగా రెళ్ళినూరుండి.

"ఎవరురా మీవూరు కరణం?"

"మా వూరు కరణంగారి నెరగరండీ"

"వెధవవు దొరికావు మీ కరణంగారేమి ప్రసిద్ధ పురుషుడా నాకు తెలియటానికి? ఎట్లా నీతో గోల? ఆపైకం యిట్లాతే నీవు వట్టి ఫూలులాగ కనిపిస్తున్నావే"

అందుకనే పంపారండి.

డబ్బు యివ్వరా?

టికెట్టు ఇవ్వండి డబ్బు యిస్తాను. డబ్బు ఎక్కడికి పోతుందండోయి కరణంగారి సిస్తుడబ్బు నేమోసాను, ఒకమారు ఏమయిందనుకొన్నారు.

ఓరి సోది రాముడా!

నా పేరు మీకెట్లా తెలిసిందండీ బాబూ"

వెధవ నీతో మాట్లాడడానికి నాకు తెరిపిలేదు పో అని వెనక్కు తిరిగేసరికి రాముడు "ఓ గూట్లో దొరా" "ఓ టిక్కెటుబాబో" అని కేక లేశాడు. ఆయన పాపం మళ్ళీ తిరిగొచ్చాడు.

ఏంటండి బాబు డబ్బు ఇదేమండీ ఆవూరు టిక్కెటియ్యండి.

ఆయన బెజవాడకు టిక్కెట్టుతీసి మిగతా పైకం జేతిలో పెట్టాడు'

రాముడు అవి తీసికెళ్ళి బాబయ్యకు చూపాడు. ఓరి వెధవ బెజవాడకు తెచ్చావేంరా అని తిట్టి పోనీలే అని "నేను ముందుపోతాను, నీవు అమ్మగారిని తీసుకొనిరా" అని చెప్పి ఆయన ముందు పోయినారు,

రాముడూ పిన్నిగారూ మేమూ బయలుదేరాము. మూట ముల్లే రాముడి నెత్తిమీద పెట్టాము. బయలుదేరాము. గేటులో ఆయన టిక్కెటు చూపమన్నాడు. రాముడికి కోపం వచ్చింది. "ఎవరనుకొన్నా రేమండోయి దొరగారిని టిక్కెట్టు అడగడమె. నా తలగుడ్డలో ఉన్నయి పోనీయండి" అన్నాడు. చూపమని అడిగాడు. అతడు, "ఏమి అనుమానమండీ" అని "ఆడికి రా చూపుతాను పైన పెట్టె లున్నాయి ఎట్లాగ" అని అదరగండంచేసినా ఆ ముండా వాడు పోనివ్వనందున వాడిచేత నే పెట్టి దింపించుకొని చూపి మళ్ళీ ఎత్తించుకొని దారి నడిచాడు.

"రాముడూ ఇక నీవెళ్ళరా" అన్నది పిన్నిగారు. మిమ్మున్ని బండెక్కించి వెడతానండీ అన్నాడు వాడు.

చెక్క వంగింది. రాముడు తొంగితొంగి చూశాడు. ధన్ ధన్ మంటూ రైలు వచ్చింది. నేను భయపడతానేమో నని నా చెయ్యి పట్టుకొన్నారు బాబుగారు. నాకేమి భయం లేదని ఛాతీ విరిచి నే నన్నాను. బండి ఆగింది. రాముడు సామాను ఎక్కించాడు. మేమంతా ఎక్కాము. అబ్బాయి గారూ మధ్యగా కూకోండి. కిటికీదగ్గ రొద్దండోయి అమ్మ గారు మరీ చెప్పారు. నాన్నగారు ఉత్తరాలు వ్రాస్తాం టారు లెండి భయములేదు. అని పోంగానే ఉత్తరం వ్రాయండి అమ్మగారు బెంగెట్టుకొంటుంది అన్నాడు, అమ్మ మాట ఎత్తేసరికి నా వళ్ళు ఝల్లుమన్నది. కళ్ళనీళ్ళు గిర్రున తిరిగినివి. కిటికీలోనుండి రాముడు వెళ్ళుతూన్న వేపు చూచాను. పచ్చలాంతరు గార్డు చూపాడు. బండి కదిలి బయలుదేరింది. వేగం ఎక్కింది. పొలాలు యిండ్లు చెట్లు అన్నీ గిర్రున జారిపోతున్నయి. మా వూరు వేపు వదలి అవి పోతున్నయి. అతివేగంతో మా అమ్మను నాన్నను వదిలేసి వెళ్ళిపోయినాను.

# ఎందుకు?

హేమచంద్రుడు మంచి వంశములో పుట్టినవాడు. భాగ్యవంతుల వంశంలో జన్మించడంచేత అతనికి ఏ కొరత లేక జరుగుతుండేది. పల్నాడులో అతనికి ఒక పెద్ద మేడ ఉన్నది, ఒక తోట ఉన్నది. ఆ తోటలో అనేక పుష్పజాతులున్నవి.

అతడు తెలుగులో ఇంగ్లీషులో కూడా చదువుకొన్నవాడు. ప్రకృతి అంటే అతనికి ఎక్కువ ప్రేమ. చదువుకొని తీరిక అయినప్పుడల్లా అతడు ఆ తోటలో విహరిస్తూ ఉంటాడు. అక్కడ కొండవాగు జలజలమని ప్రవహిస్తూ ఉంటుంది. దాని ప్రక్కనే అడవి పూలచెట్లు విరివిగాపూచి ఉంటవి, ఎక్కడ కోవిల పంచమ స్వరంతో పాడుతూ ఉంటుందో, ఎక్కడ పూలు గుబురుగా పూచి ఉంటవో, అక్కడ హేమచంద్రుడు ఉండి తన యౌవన హృదయాన్ని ప్రకృతి సౌందర్యామృతంతో నింపి పిపాస దీర్చుకొనేవాడు నిత్యం.

ఒకరోజు అతని సహోదరి అతనితో తోటలోకి వచ్చినది. ఒక పువ్వు కోసి యియ్యమని కోరినది. అతడు సరే యని పువ్వును కోసి ఇచ్చినాడు. కాని సుందరమైన వస్తువును పాడుచేసినానని బహు విచారపడినాడు. భౌతిక వాంఛతో సహజసౌందర్యాన్ని కోమలహృదయుడు భగ్నం చేసి ఆనందించలేడు.

## 2

గోపాలం హేమచంద్రుడికి బాల్యస్నేహితుడు. చంద్రునికి ఇంకా వివాహం కాలేదు. కాని గోపాలానికి భార్య కాపరానికి వచ్చింది. గోపాలంభార్య మిక్కిలి సౌందర్యవతి. ఆమె మంచి పొడగరి. గులాబీపువ్వులాంటి దేహచ్ఛాయ. అందులో పాలపొంగువంటి ప్రాయము. ఆ చంచల వీక్షణములు, ఆ యౌవన సౌందర్యము, ఆ వేణీవిలాసము, ఆ పరిపుష్టి నొందిన బాహువుల సొబగు, ఎవ్వని హృదయమాకర్షించవు?

గోపాలం చంద్రాన్ని వినాయకచవితి రోజున విందుకు పిలిచినాడు. చంద్రం వెళ్ళినాడు.

ఇదివరలో చంద్రం గోపాలం భార్యలాంటి చక్కని దాన్ని చూడలేదు. మొదటిసారి స్వజాతీయ సౌందర్యాన్ని చూచినాడు. సజీవమైన వస్తువులో అట్టి సౌందర్యమును చూచినప్పుడు అతని హృదయం, చంద్రోదయ సమయాన సముద్రములాగ పొంగినది. ప్రేమ వాహిని బయలుదేరినది సౌందర్యము ఆనందంమిస్తుంది. ఆనందం ప్రేమకు మూలము. మనకు ఏదైతే ఆనందం ఇవ్వదో దాన్ని మనము ప్రేమించలేము! ప్రకృతి సౌందర్యమయము. పరమేశ్వరుడు ఆనంద స్వరూపుడు. మానవహృదయం ప్రేమపిపాసామయం.

అతను గోపాలంతో విస్తరిముందు కూర్చున్నాడు.

గోపాలం భార్య వడ్డిస్తున్నది, చంద్రం ఆమెను చూస్తూ ఉండిపోయినాడు. పక్కన గోపాలం ఉన్నాడనే సంగతే అతనికి స్పృహ లేదు. ఆ సౌందర్యం ఇతనిని ఈడుస్తున్నది. అతని హృదయం ఆ కోమల సౌందర్యాబ్ధిలో మునిగి తేలుతున్నది. ఆనందంతో ఆత్మను మేళవించినపుడు బాహ్య ప్రకృతి చలింపజేయలేదు. ఆ సౌందర్యమూర్తి ఎటునడిస్తే అటువైపు ఇతని దృష్టి తిరుగుతున్నది. మహాప్రవాహంలో ఎవరైనను ఎదురీదగలరా? ప్రవాహం అతనిని మహా వేగంతో ఈడుస్తున్నది. అతను విస్తరిముందు కూర్చున్నాడన్న మాటేగాని ముద్ద ఎత్తలేదు. ఆ సౌందర్యమనే మధువును ఒక్కొక్క బొట్టు తాగుతున్నాడు.

హేమచంద్రుని పిచ్చి చూపులు చూచి గోపాలం నివ్వెరపడ్డాడు. స్నేహితుడిని చూచి జాలిపొంది చేయ వోయ్ భోజనం చెయ్యి అని హెచ్చరించినాడు. తల వంచుకొని చంద్రం రెండుముద్దలు తిన్నాడు కాని వెంటనే ఆమె వంక చూడటం ప్రారంభించినాడు. నూపురధ్వనులతో తన జయాన్ని ప్రకటిస్తూ వున్న సౌందర్యంయొక్క అద్భుత శక్తికి అతను లోబడినాడు. అతను అన్నం తినలేకపోయినాడు. గోపాలం ఇంతలో భోజనం పూర్తిచేసి లేద్దాం అన్నాడు. చంద్రంకూడా సరేలే అన్నాడు.

ఇద్దరు గదిలోకి వెళ్ళినారు. గోపాలం భార్య తమలపాకులు తెచ్చినది. హేమచంద్రుడు ఆమె వంక మళ్ళీ చూడటం మొదలు పెట్టినాడు. గోపాలానికి చంద్రాన్ని చూస్తే జాలేసింది. అతడు సహృదయుడని తెలియును. సౌందర్యానికి, లోబడినాడని గ్రహించినాడు. అతనిని సంతోషపెట్టదలచి భార్యను ఉద్దేశించి "ఈయన నిన్ను ఎంతసేపు చూస్తూ ఉంటాడో అంతవరకు నీవిక్కడే ఉండు" అని చెప్పి మేడపైకి పడుకోటానికి వెళ్ళినాడు.

హేమచంద్రుడు ఆమెను కొంతసేపు చూచినాడు. అతనికి తనివి తీరలేదు. దాహము తగ్గలేదు. కాని ఎందుచేతనో "వెళ్ళిపో" అన్నాడు.

3

హేమచంద్రుడు గోపాలం యింటి నుంచి తన ఇంటికి వెళ్ళిపోయినాడు. తన గదిలో పరుపుపై పడుకొనినాడు. గవాక్షంలో నుంచి అతను తన తోటను చూడవచ్చును. ఆ తోటలో అనేక రకముల గులాబీఅంట్లు ఉన్నవి. చేమంతులు మల్లెలు. ఇంకా అన్నిరకముల పూలుఉన్నవి. ఇవన్ని అతనికి ఆనందాన్ని ఇచ్చినవి. ఇవన్ని ఎల్లాగ ఆనందాన్ని ఇచ్చినవో గోపాలం భార్య అతనికి అల్లాగే ఆనందాన్ని ఇచ్చినది. ఒకమారు తోటలోకి వెళ్ళి చూచి మళ్ళీ ఆ తోటలోకి యింకొకమారు వెళ్ళి చూడవలెనని బుద్ధి పుట్టుట సహజం. అల్లాగే అతడు సుందరిని చూడాలని బుద్ధి పుట్టి

నది. మళ్ళా గోపాలం ఇంటికి వెళ్ళినాడు. గోపాలం ఇంట్లో లేడు. ఇంట్లోకి వెళ్ళినాడు. ఇతనిని చూచి పరుగెత్తుకొని పోయి తలుపు వేసుకొన్నది సుందరి.

అతను తిరిగి ఇంటికివచ్చినాడు. తోటలో పడక కుర్చీలో కూర్చున్నాడు. తోట అతనికి పూర్వంలాగా శాంతినియ్యలేక పోయింది. ఆ జంగమసౌందర్యం ఈ అచల సౌందర్యాన్ని అణగద్రొక్కింది. అతని మనోవృత్తి అదో విధంగా మారింది. సుందరి సంఘంయొక్క కట్టుబాట్లలో బడ్డది. ఆమెను తన ఇష్టం వచ్చినన్ని సార్లు చూచుటకు వీలు లేదనే విషయం ఇప్పుడు తెలిసినది. అక్కడే అతని కళ్ళు మూతలుపడ్డయి. అప్పుడు అతడో చిన్న కల గన్నాడు. ఆ కలలో సంఘరాక్షసి అతనికి కనిపించి—"చంద్రుడా, నీవు నా కట్టుబాట్లకు వ్యతిరేకంగా నడవటానికి ప్రయత్నిస్తు న్నావు. మానవులందరిని నేను కొన్ని కట్టుబాట్లతో కట్టి వేసితిని. ఆ కట్లు తెంపినా తెగవు" అని చెప్పినది.

హేమచంద్రుడు నిద్రనుండి మేల్కొన్నాడు, అతను ఏమనుకొన్నాడంటె "దయామయుడైన భగవంతుని సృష్టి లోని వస్తువులన్నీ భోగ్యములే. రాత్రిళ్ళు నక్షత్రములు కూర్చిన నీలాంబరమును కప్పుకొనియున్న ప్రకృతి సౌంద ర్యమును చూచి ఆనందించవలెను. పగలు పుష్పములను లతాగృహములను చూచి పక్షులగీతములు విని ఆనందించ వలెను, సీతాకోక చిలుకలను చూచి రెక్కలను పట్టుకొని

మృదుత్వమునకును సౌందర్యమునకును అచ్చరువొంద దగును గాని సీతాకోకచిలుక కట్టినట్టి చీరనే కట్టుకొనియున్న మోహనమూర్తిని చూడ గూడదా?

"స్నిగ్ధ తరుచ్ఛాయల దాగి అందములేని కోయిల "కూ" అని కూసిన మాత్రాన పొంగిపోవచ్చునుగాని కోకిలారవముకన్న వేయిరెట్లు ఇంపైన సుందరకంఠ ధ్వని విన కుతూహలపడటం తప్పా?

పొరుగింటి వారి పెరటిలో గులాబిపువ్వును చూచిన మాత్రాన నేను పాపిగా నాకు పరలోక ప్రాప్తియా? అని చంద్రుడు తలపోసెను.

హేమచంద్రుడు కుర్చీలో కూర్చున్నాడు. మంద మారుతము మెల్లగా వీచినది. ప్రక్కనే కొండవాగు శ్రావణమాసమగుటచే గట్లనాని పారుతున్నది. గట్లు విరిగి కూలుతున్నవి, "అయ్యో, ఈ జీవితమునకు ఈ గట్లెందుకు" అని అతడను కొన్నాడు.

"నే నేల ప్రేమించుచున్నాను!" అని అతడను కొన్నాడు,

"నే నేల పాడుచున్నాను?"

"నే నేల వికసించుచున్నాను. నే నేల సౌరభమును వెదజల్లుతున్నాను?"

"నే నేల ఇంతవేగముతో పాడుతున్నాను!" అని కేకలు అతనికి తోటలో నలుదిశలనుండి వినవచ్చెను. నేనూ అట్లే సౌందర్యము కొరకై పరితపిస్తున్నాను. అని అతని హృదయ కుహరము ప్రతిధ్వనించెను. అతను అట్లే కన్నులు

4

మూసినాడు. అతను ఏలనో నవ్వుతున్నాడు! అతనికి సుందరి కలలో కనిపించెను, ఆమె ఆ కొండవాగుదరిని ధవళాంబర ధారిణియై అగపడెను. చూతపల్లవముల బోలు ఆ వ్రేళ్ళలో ఆమె విడబారిన తుమ్మెదరెక్కవంటి కేశములను చిక్కుదీసుకొనుచుండెను.

చంద్రుడు ఆమెను సమీపించెను. ఆమె నాతని చూచి నవ్వెను. ఆనవ్వు మృదువై లజ్జాయుక్తమైయుండెను. చంద్రుడు ఆ కంపించుచున్న స్వరముతో సుందరీ ఆగుము. నీ సౌందర్యమును నన్ననుభవింపనిమ్ము" అన్నాడు.

సుందరి:—తప్పు తప్పు! నేను నీకడ ఆగకూడదు, పర పురుషునకు నా వదనవిలోకనమే!

చంద్రుడు.—చూచుటే తప్పా! ఆగవూ. తప్పని ఎవరు చెప్పిరి?

సుందరి:—సంఘనియమము.

చంద్రుడు:—నియమమా! దైవాజ్ఞ కాదుకదా? సుందరీ మానవ జీవితము నియమబద్ధమా? పుష్పములు ఒక దానితో మరొకటి ఏ నియమము ననుసరించి ముద్దాడుకొను చున్నవి, గాలి ఏ నియమము ననుసరించి వీస్తున్నది. కృష్ణాస్రవంతిలో ఏ నియమము ననుసరించి బుద్బుదములు మలయ సమీరములతో భోగించి ఐక్యమగుతున్నవి. నేను నీ సౌందర్యమునకు వశుడనైనాను ఆగవూ! నీ సౌందర్య మును త్రాగనివ్వవూ!

సుందరి:—అయ్యో! నిందపాలగుదును.

చంద్రుడు;—నిందా! సుందరీ! నిందా! అయ్యో నేనేమి చేయుదును. నా మనస్సు నిర్మలమైనది. నిష్కలంక మైనది, పాపచింత లేదు. నేను సౌందర్యమును సౌందర్యము కొరకే ప్రేమిస్తున్నాను. "ఏ సౌందర్యోప భోగమునం దింద్రియ సంబంధమైన భావోద్రేకము లేకుండునో అట్టి సౌందర్యమే సౌందర్యము" అట్టి సౌందర్యకు.........

సుందరి:—"నేను నిందపాలగుదును. నే......"

హేమచంద్రుడు మేల్కొన్నాడు. దక్షిణపు గాలికి గులాబీలు విచ్చి అల్లల్లాడుతున్నవి. ఈతని జూచి మాలతీ లత ఫక్కున నవ్వినది. దాని పూలు జలజల వానిపై రాలినవి.

ఆ సౌందర్యమును అనుభవించుటకు వీలు లేదని అత నికి బోధపడెను. అట్టి సౌందర్యమును అనుభవించని జీవనము నిష్ఫలమని అతడు నిశ్చయించుకొనెను.

o o o

—ఆ సౌందర్య మనెడు దేదీప్యమానమైన ఆ అఖండ జ్యోతిముందు ఈ చిన్ని ఆముదపు దీపము ఆరిపోయినది, దరిలేని సముద్రమునుజూచి కొండవాగు తన బ్రతుకు దుస్సహ మని తలచి ఒక్కమారు అందరినిచూచి దూకి అంతరించింది.

—సంపూర్ణము—

శ్రీ మానస ప్రచురణ

## మునిమాణిక్యం నరసింహారావు

ఆధునిక తెలుగు సాహిత్యంలో 'కాంతం' అయస్కాంతంలా ఎవరిని ఆకర్షించలేదు?! 'కాంతం' పేరు తెలియని తెలుగు కథా పాఠకుడు ఎవరైనా ఉంటారా? పరమాహ్లాదకరమైన కుటుంబ జీవితేతి వృత్తాన్ని కథగా చెప్పిన మనస్వి శ్రీమునిమాణిక్యం. రెండు ప్రపంచ మహాయుద్ధాల నడిమి కాలంలో సాహిత్యసిద్ధాంతాల వెంట, రాజకీయ ఉద్యమాల వెంట అస్తవ్యస్తంగా, గందరగోళంగా ఉన్న తెలుగు సాహిత్యంలో ఒయాసిస్సులాగానూ, వెన్నెల రాత్రిలాగాను ఆయన కథలు దర్శనమిస్తాయి. కాంతం కథలు, నేనూ మా కాంతం, తిరుమాళిగ, రుక్కుతల్లి, స్తుతి - ఆత్మస్తుతి, దాంపత్యోపనిషత్, హాస్య కుసుమావళి, గృహప్రవేశం, దీక్షితులు లాంటి మునిమాణిక్యం రచనలు ఎవరైనా మరిచిపోగలరా? ఆయన కథలన్నీ శరద్రాత్రులే.

శ్రీ మానస పబ్లికేషన్స్
గవర్నర్ పేట. విజయవాడ - 520 002